# నవతరం పిల్లల వాణి
# చందమామ @
# chandamama.com\telugu



పాత కొత్తల మేలుకలయికగా చందమామ ఆన్‌లైన్ ఎడిషన్ @
chandamama.com\telugu

### అలనాటి కథలకు నిలయం

చందమామ.కామ్/తెలుగు సర్ఫ్ చేయండి. వందలాది కథలను, కామిక్స్‌ను చూడండి. అలనాటి పౌరాణిక, ఐతిహాసిక, జానపద కథలు, చందమామ హీరోలను వీక్షించండి... ఇంటర్నెట్ చూసే పిల్లలకు, పెద్దలకు కూడా విజ్ఞాన, వినోదభరిత వెబ్‌సైట్.

### ఆన్‌లైన్ ఎడిషన్ ఛానళ్లు

పురాణాలు, సమకాలీన అంశాలు, కామిక్స్, కథలు, పోటీలు, షాపింగ్, ఆర్కైవ్స్ మొదలైన ఛానళ్లు మీ కోసమే...



### చందమామ రచయిత కావాలని ఉందా?

chandama.com\telugu లోకి వచ్చి మీ స్వంత రచనలు, కథలు, అనుభవాలు, చెణుకులు, పెయింటింగ్స్, చిత్రాలు, ఘటనలను పోస్టింగ్ చేయండి.

### సమకాలీన అంశాలు

హాస్యం, జీవిత చరిత్రలు, వార్తలు, చరిత్రలో ఈ రోజు, లోకజ్ఞానం, క్రీడలు, విజ్ఞాన శాస్త్రం, వైద్యం వంటి సమకాలీన అంశాలకు చోటు.







### ఇంకా మరెన్నో...

బ్లాగులు, తెలుగు నీతి పద్యాలు, జాతీయాలు, సూక్తులు, పాత సినీ గీతాలు, క్విజ్, పజిల్స్, జానపద గీతాలు, లోకజ్ఞానం, జంతు ప్రపంచం, పిల్లల జ్ఞాపకాలు, తరగతిగది ముచ్చట్లు, చిత్రాలు ఆరోగ్య చిట్కాలు, కథనాలు, పుస్తక పరిచయాలు, మరెన్నో... చూడవచ్చు.





చందమామ సంపుటి: 62 మార్చ్ 2009 సంచిక:03

## ఈ నెల విశేషాలు



హేమచంద్రుడి ప్రవర్తన (బే.క) ...19



బంగారు చేప ...38



ఒక వీరుడి మరణం ...46



రామాయణం (యుద్ధకాండ - 3) ...57

## ఈ సంచికలో...





## అమరవాణి

స్నేహానికి దూరం లేదు. కొండల మీది నెమళ్ళకూ, ఆకాశాన మేఘానికీ స్నేహం; ఊహించలేని దూరాన ఉన్న సూర్యుడికీ, నీటిలోని పద్మాలకూ స్నేహం; ఎంతో దూరాన ఉన్న చంద్రుడు కలువలకు ఆప్తుడు.

★★★

స్నేహం ఏర్పడేదాకా మర్యాద అవసరం. స్నేహం కలిగిన తరవాత చేసే మర్యాద అమర్యాద అవుతుంది.

# పరీక్షల సమయం - తల్లి తండ్రులకు ఓ మాట

సంవత్సరంలో చాలా కీలకమైన సమయం ఇది. మార్చినెల రాగానే పరీక్షలకోసం అర్ధరాత్రి చదువులతో పిల్లలు తలమునకలై పోతారు. మరీ పబ్లిక్ పరీక్షలు రాసేవాళ్ళకయితే అత్యధిక మార్కుల లక్ష్యంతో ట్యూషన్లపై ట్యూషన్లు, పరీక్షలపై పరీక్షలు తప్పడం లేదు. ఇక ఫస్టు మార్కులపై తపనతో తామూ నిద్రపోకుండా, పిల్లలనూ నిద్రపోనివ్వకుండా పిల్లలకన్నా ఎక్కువ ఒత్తిడికీ, ఉద్రిక్తతకూ లోనయ్యే తల్లి తండ్రులూ లేకపోలేదు! ఇలా కుటుంబం కుటుంబమంతా ఒత్తిడితో నిండిన ఉద్రిక్త వాతావరణం అలముకుంటోంది!

ఇక్కడ ఒక ముఖ్య విషయం ఆలోచించాలి. పరీక్షల్లో ఫస్టు మార్కులు సంపాయించడం ఒక్కటేనా చదువుల పరమార్థం? పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకోవడం ముఖ్యమే. కాని, వాటికోసం ఎలాంటి మూల్యం చెల్లిస్తున్నామన్నది అంతకన్నా ముఖ్యం. అడ్డుదారులు తొక్కి అపహాస్యం పాలుకాకూడదు!

ఇంతకూ పరీక్షలంటే ఏమిటి? విద్యా సంవత్సరమంతా నేర్చిన విద్యనూ, సముపార్జించిన జ్ఞానాన్నీ, పెంపొందించుకున్న అవగాహననూ, నైపుణ్యాన్నీ పరీక్షించేవే సంవత్సరాంత పరీక్షలు. వాటిని సమర్థవంతంగా ఎదుర్కోవడానికి తల్లి తండ్రులు ప్రారంభం నుంచీ పిల్లలకు పద్ధతి ప్రకారం సహకరించి, ప్రోత్సహించాలే తప్ప వాళ్ళ ఒత్తిడిని పెంచడానికి ప్రయత్నించకూడదు.

ఈ విషయంలో విద్యార్థుల ఒత్తిడిని తగ్గించి, పరీక్షలను దీటుగా ఎదుర్కోవడానికి ఇటీవల కొందరు నిపుణులు కౌన్సెలింగ్స్ నిర్వహిస్తున్నారు. ఇది చాలా ఆరోగ్యకరమైన ధోరణి. ఇలాంటి నిపుణులు వాస్తవిక అంచనాలతో ఎదురుచూడాలని తల్లి తండ్రులకు సలహాలివ్వడం ఇక్కడ గుర్తించతగ్గ విశేషం!

పిల్లలు పరీక్షలలో మంచి మార్కులు తెచ్చుకోవడం ముఖ్యం. అయితే, అసలైన జీవిత పరీక్షలో సమర్థవంతంగా నెగ్గుకురావడం అంతకన్నా ముఖ్యం. ఈ సత్యాన్ని గుర్తించి తల్లి తండ్రులు, ఉపాధ్యాయులు, పాఠశాలలు అందుకు తగిన విధంగా మసలుకోవడం ఎంతయినా అవసరం!

సంపాదకుడు : ఎల్. సుబ్రమణ్యాన్

Visit us at : http://www.chandamama.com/telugu





***Founded by***
**B. Nagi Reddi and Chakrapani**

***Chairman :*** B. Viswanatha Reddi (Viswam)
***Editor & Publisher :*** L. Subramanyan
***Consultant Editor :*** K. Ramakrishnan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** Jayapandian
***Assistant Editor-Copy & Pre-Production :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designer :*** B.A. Hemalata Malini

***CIRCULATION TEAM :***
***Chennai :*** **T N Ravi Shankar, *National Sales Manager***
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South***
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
***Mumbai :*** **Rajendra K Jadhav, *Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi :*** **CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor,
Connaught Place, New Delhi-110001
Mobile +91 99110 91022
***Bangalore :*** **P. Murali, *Asst. Circulation Manager - Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
***Kolkata :*** **Ananth Prakash, *Circulation Manager-East***
Mobile +91 98362 82202, 98351 82202
**CHANDAMAMA INDIA LTD.,** 2, Decers Lane,
Opp. S.K. Automobile, Kolkata- 700069. West Bengal.
email : ananth.prakash@chandamama.com
***Ahmedabad :*** **Kalpesh Raval, *Sales Officer-Circulation***
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : sowmya.b@chandamama.com
***Head - Business Development :*** **Surajit Agarwal**
email : surajit@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Subscription Queries:*** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road,
Chinna Neelankarai, Chennai - 600 041
Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

# పాఠకుల లేఖలు



పిల్లల చెయ్యిపట్టుకుని ఏవో అద్భుత లోకాలకు తీసుకువెళ్ళే శక్తి ఒక్క చందమామకే ఉంది. కథా శిల్పంలో కుటుంబరావు పెట్టిన ఒరవడి, కథలకు తగ్గ అద్భుత చిత్రాలు. చందమామ ప్రత్యేకత. చందమామ విజయానికి ముఖ్యకారణం బొమ్మలు అన్నది మరువరాని సత్యం. ఆ ఘనతలో శంకర్‌గారికే ఎక్కువభాగం. ఆయన పది కాలాల పాటు ఇలాగే బొమ్మలు వేస్తూండాలని నా ఆకాంక్ష. ఇప్పుడొస్తున్న చంద మామలో కథల సంఖ్య తగ్గి, శీర్షికల సంఖ్య అధికం కావడం మనసును బాధిస్తోంది. పేజీలు పెంచండి. ఎక్కువ కథలు వేయండి. కాలాలు మారినా, స్థలాలు మారినా మానవస్వభావాలు మారవు కదా! ఈ సూచనను సహృదయంతో మన్నిస్తారని ఆశిస్తూ, మరెన్నో తరాలవరకూ చందమామ వెలిగిపోవాలని ఆకాంక్షిస్తూ,

-డాక్టర్ కె. ధనలక్ష్మి,
విద్యానగర్ - **524 413** నెల్లూరు జిల్లా

**ఉత్తమ లేఖకు బహుమతి!**

'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. **250/-** బహుమతి అందజేస్తున్నాం. చంద మామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం.దాంతో పాటు మీ అభిప్రాయాలను ఇమెయిల్ feedback@chandamama.com ద్వారా, SMS MLANG <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.



# దొరికిన సొమ్ము

రామతీర్థంలోని శ్రీకంతుడు చాలా నిజాయితీ పరుడు. తండ్రి నుంచి సంక్రమించిన బట్టల వ్యాపారాన్ని సక్రమంగా నిర్వహించేవాడు. అతడికి ఆస్తి పాస్తులకు లోటు లేదు గాని, ఎంగిలి చేత్తో కాకిని తరమని పరమ పిసినారి. బట్టల దుకాణానికి పక్కనే ఒక కిరాణాకొట్టు ప్రారంభించాడు. ప్రతి శుక్రవారం తనే స్వయంగా లక్ష్మీపురం సంతకు వెళ్ళి కావల సిన సరుకులు కొని తెచ్చుకునేవాడు.

అలా ఒకసారి సంతకు వెళ్ళి వస్తూండగా అతడికి దారిలో చిన్న డబ్బు మూట దొరి కింది. దరిదాపుల్లో ఒక్కరూ కనిపించలేదు. డబ్బు మూటను భద్రంగా దాచుకుని దాన్ని ఏమి చెయ్యడమా అన్న ఆలోచనతో ఇంటి ముఖం పట్టాడు.

ఇంటికి చేరగానే డబ్బు మూటను భార్య మీనాక్షికి ఇస్తూ జరిగింది వివరించి, ''అను కోకుండా దొరికిన ఈ సొమ్మును నా వ్యాపా రంలో మదుపుగా వినియోగించు కోవడం నాకు ఇష్టం లేదు. గ్రామాధికారికి అప్పగిస్తే, అది పోగొట్టుకున్న వారికి చేరుతుందన్న నమ్మకం లేదు,'' అన్నాడు.

అంతలో అతడి భార్య మూటలోని డబ్బును లెక్క గట్టి చూసింది. సరిగ్గా వెయ్యి రూపాయిలు ఉన్నాయి. ''పరాయి సొమ్ము పామువంటిది. దీన్ని మనవద్ద ఉంచుకోలేం. ఇది ఎవరిదో తెలుసుకుని వారికి అప్పగించ డమే మంచిది,'' అన్నది ఆమె.

''ఎవరిదో తెలియక ఎలా అప్పగించ గలం? పోనీ వేణుగోపాలస్వామి గుడి హుండీలో వేస్తే పుణ్యమైనా దక్కుతుంది కదా?'' అన్నాడు శ్రీకంతుడు.

''డబ్బు మనది కానప్పుడు పుణ్యం మాత్రం మనకెలా దక్కుతుంది? పైగా

కె.కె. రఘునందన



పోగొట్టుకున్న వారికి అది అందదు కదా?'' అన్నది మీనాక్షి.

''అందుకే దీన్ని ఏం చెయ్యాలో తోచడం లేదు. దీన్ని గురించి ఆలోచిస్తూ ఇక్కడ కూర్చుంటే అక్కడ కొట్టులో వ్యాపారం దెబ్బ తింటుంది,'' అంటూ శ్రీకంఠుడు డబ్బు మూటను భోషాణంలో భద్రంగా దాచి కొట్టుకు బయలుదేరబోయాడు.

అప్పుడు తల మీద బట్టల మూటనెత్తుకుని ఊరూరా తిరిగి వ్యాపారం చేసే రంగయ్య అక్కడికి వచ్చి, ''నా కుమార్తెకు ప్రసవ సమయం. కాన్పు కష్టం కావచ్చు. పట్నం వైద్యశాలకు తీసుకువెళ్ళమని ప్రసవం చూసే మంత్రసాని చెబుతున్నది. సమయానికి చేతిలో దమ్మిడీ లేదు. పరిస్థితి విషమంగా ఉంది. రెండు వందలు ఇచ్చారంటే, వీలైనంత త్వరలో తిప్పి ఇచ్చేస్తాను,'' అని ప్రాథేయ పడ్డాడు. శ్రీకంఠుడు వెంటనే ఇంట్లోకి వెళ్ళి, దొరికిన డబ్బు మూటలోంచి రెండు వందల రూపాయిలు తెచ్చి, రంగయ్య కిచ్చి కొట్టుకు వెళ్ళిపోయాడు.

రెండు రోజుల తరవాత పట్నంనుంచి తిరిగి వచ్చిన రంగయ్య శ్రీకంఠుణ్ణి చూడ వచ్చి, ''అయ్యా, నా కూతురు పండంటి మగ బిడ్డను కనింది. సమయానికి మీరు చేసిన సాయం వల్ల రెండు ప్రాణాలు నిలిచాయి. మీ మేలు ఈ జన్మకు మరిచిపోను,'' అన్నాడు.

శ్రీకంఠుడు సంతోషంగా అతడి కేసి చూస్తూ, ''నే నిచ్చిన డబ్బు వల్ల మీకు మేలు జరగడం నాకెంతో ఆనందం కలిగించింది. అందువల్ల ఆ డబ్బును తిరిగి ఇవ్వ నవసరం లేదు. నీ మనవడికి కానుకగా ఇచ్చినట్ట నుకో,'' అన్నాడు.

ఆ మాటకు రంగయ్య ఆశ్చర్య పోయినా, మరేమీ మాట్లాడకుండా చేతులెత్తి మొక్కి కృతజ్ఞతలు తెలియచేసి వెళ్ళిపోయాడు.

శ్రీకంఠుడు భార్య కేసి తిరిగి, ''చూశావా, దొరికిన డబ్బుతో మనం చేసిన సాయం వల్ల రెండు నిండు ప్రాణాలు నిలబడ్డాయి. మనకు మంచి పేరు కూడా వచ్చింది. మిగిలిన డబ్బును కూడా అలాగే వినియోగిద్దాం,'' అన్నాడు.

భర్త మాటలకు మరేమీ మాట్లాడ కుండా అవునన్నట్టు తల ఊపింది మీనాక్షి.

మరో రెండు వారాలు గడిచాయి. బట్టల దుకాణంలో పనిచేసే శివయ్య నాలుగు

రోజులు వరసగా రాకుండా ఐదో రోజు వచ్చే సరికి శ్రీకంఠుడు మండిపడి, ''వ్యాపారం ముమ్మరంగా సాగే రోజుల్లో నాలుగు రోజులు రాకపోతే వ్యాపారం ఏమవుతుందో తెలుసా? వస్తే సక్రమంగా రా. లేకుంటే మానెయ్. పెరొకణ్ణి చూసుకుంటాను,'' అన్నాడు.

''క్షమించడయ్యా, ఉన్న కుంటెడు పొలంలో పైరు పెట్టడానికి పెట్టుబడి పెట్టే శక్తి లేదు. వరినాటు వేసుకుంటే తప్ప, తిండి గింజలు ఉండవు. పెట్టుబడి కోసం అడగరాని వాళ్ళందరినీ అడిగాను, అయినా అప్పు పుట్టలేదు. అందుకేపనిలోకిరాలేకపోయాను,'' అన్నాడు శివయ్య దీనంగా.

''ఆ విషయం నాతో చెప్పకుండా ఎక్క డెక్కడో తిరగడమెందుకు? నన్నడిగితే నేనే ఇచ్చేవాణ్ణి కదా? దాని కోసం తిరుగుతూ పని ఎగ్గొడితే ఎలా?'' అన్నాడు శ్రీకంఠుడు. శివయ్య తన చెవులను తనే నమ్మలేక పోయాడు. తన యజమాని నోటినుంచేనా ఆ మాటలు వచ్చాయి అని విస్తుపోయాడు.

శ్రీకంఠుడు ఇంటికి వెళ్ళి దొరికిన సొమ్ము నుంచి ఐదువందలు తెచ్చి శివయ్య చేతి కిచ్చాడు.

''అయ్యా, దీన్ని నేను ఒక్కసారిగా ఇచ్చు కోలేను. నా జీతం డబ్బుల నుంచి నెలనెలా కొద్దికొద్దిగా రాబట్టుకోండి,'' అన్నాడు శివయ్య ఎంతో కృతజ్ఞతతో.

''అదేం అక్కర్లేదు, నువ్వు నాకు రూపాయి తిరిగి ఇవ్వనవసరం లేదు,'' అన్నాడు శ్రీకం ఠుడు. ఇది మరీ విడ్డూరంగా కనిపించింది శివయ్యకు. అయినా మరేమీ మాట్లాడకుండా అక్కడి నుంచి బయలుదేరాడు.



మరో రెండు నెలల తరవాత శివయ్య యజమానితో, ''తమ దయవల్ల మా పొలం పంటతో కళ కళ లాడుతోంది. పిల్లా పాపకు ఈ యేడు తిండికి లోటుండదు,'' అన్నాడు.

ఆ రోజు సాయంకాలం ఇల్లు చేరగానే శ్రీకంఠుడు ఆవిషయం భార్యకు చెబుతూ, ''చూశావా, దొరికిన సొమ్మును సొంతానికి వాడుకోకుండా పరుల అవసరాలకు ఇచ్చి ఆదుకోవడం వల్ల నాకు ఎంత మంచి పేరు వచ్చిందో,'' అన్నాడు ఆనందంగా.

''మీకు దొరికిన సొమ్మును సొంతానికి వాడుకోకుండా పరులకు దానంగా ఇవ్వడం మంచిదే. మరి, మీకు దొరికిన సొమ్ము లాంటిదే కదా మీ ఆస్తిపాస్తులు కూడా. అవి ఉండికూడా మీలోని దానగుణం ఇన్నాళ్ళు ఏమయింది?'' అన్నది మీనాక్షి.

ఆ మాటకు ఉలిక్కిపడ్డ శ్రీకంఠుడు, ''నా ఆస్తి పాస్తులు దొరికిన సొమ్ము వంటిదా?'' అని ఆశ్చర్యపోయాడు.

''అవును మరి, మీ ఆస్తులు మీ తండ్రి నుంచి మీకు సంక్రమించాయి. వాటి కోసం మీరెలాంటి శ్రమా పడలేదు. శ్రమపడి సంపాదించని సొమ్ము దొరికిన సొమ్ములాంటిదే కదా? ఇప్పుడు దొరికిన ఎవరి సొమ్మునోదానం చేస్తూ తెగ మురిసి పోతూన్న మీరు సంక్రమించిన ఆస్తి నుంచి ఎంతో కొంత దాన ధర్మాలకు ఉపయోగిస్తే మీరు మరింత ఆనందం అనుభవించే వారుకదా,'' అన్నది మీనాక్షి నెమ్మదిగా.

శ్రీకంఠుడు కొంత సేపు మౌనంగా ఆలోచించి తల పంకిస్తూ, ''అవును మీనాక్షీ, నువ్వన్నది అక్షరాలా నిజం. లేనివారికి ఇంత ఇవ్వడం; దానిద్వారా మంచి పేరు పొందడం ఈ రెండింటిలోనే ఆనందం ఉందని పెద్దలు చెప్పగా విన్నాను కాని, ఇన్నాళ్ళు నా కది చెవి కెక్కలేదు. డబ్బు మూట దొరికాక అనుభవంతో ఆ సత్యాన్ని తెలుసుకున్నాను. ఇకపై మన డబ్బునుంచి కూడా కొంత భాగాన్ని ఇతరులకు సాయ పడడానికి వినియోగిస్తాను,'' అన్నాడు.

భర్తలో వచ్చిన మార్పుకు మీనాక్షిఎంతగానో ఆనందించింది.



# VALOUR & ADVENTURE
# HUMOUR & MYSTERY
# MORALS & HEROES

## Enthralling stories of six decades come together in one incomparable collection




The Chandamama
60th Anniversary Collector's Edition
HARD COVER
Cover Price : Rs 449

**Special price for subscribers Nett. Rs. 360**




COLLECTOR'S EDITION

Take a trip down memory lane with the magazine's oldest editors, discover the beginnings of Chandamama and view some of the most memorable cover art across the decades.

Subscribers must fill in the order form below to avail of special discount.

**I want a copy of the Chandamama Collector's Edition.**

Name........................................................ Subscriber No ..........................................

Address..........................................................................................................

City ................................ State ................................ Pin ................................

Telephone ................................ Mobile ................................ Email ................................

Enclosed Cheque/DD for Rupees (in words) ..........................................................

Cheque/DD no ................................ Favouring **Chandamama India Ltd**

on ..........................................bank. *(Send At-Par cheques or add Rs 60 for non-Chennai cheques)*

Please mail the order form to :

**Chandamama India Limited**, No. 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelangarai, Chennai – 600 041. Phone: (044) 43992828 Email: chandamama@chandamama.com Web: www.chandamama.com. Allow 3 weeks for delivery.



# హోలీ - రంగుల బలం

నవాబు వజీద్ అలీషా పాలనా కాలం అది. యాదృచ్ఛికంగా హోలీ పండుగ, మొహరం రెండూ ఒకే రోజున వచ్చాయి. హోలీ పండుగ ఆనందోత్సాహాలతోనూ, మొహరం సంతాప సూచకంగానూ జరుపుకుంటారని మనకు తెలుసు. లక్నోలోని హిందువులు దీనిని గురించి ఆలోచించారు. ఆ రోజున వేడుకలు జరుపుకోవడం సబబు కాదని భావించారు. ముస్లిం సోదరుల మనోభావాల పట్ల వాళ్ళకున్న గౌరవాదరాలు అలాంటివి.

మొహరం ఊరేగింపులో పాలు పంచుకుని, మరి కొందరు ముస్లిం సోదరులతో కలిసి నవాబు తిరిగి వస్తున్నాడు. వీధులలో ప్రజలు రంగులతో సంబరాలు జరుపుకుంటూ ఉంటారని ఆయన అనుకున్నాడు. అయితే, వీధులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. ఆశ్చర్య పోయిన నవాబు కారణం ఆరా తీశాడు. సంతాపదినం జరుపుకునే వారి కోసం ప్రజలు స్వచ్ఛందంగా తమ సంబరాలను త్యాగం చేశారని తెలిసి ఆశ్చర్యానందాలకు లోనయ్యాడు. వాళ్ళు అలా తమను అంతగా గౌరవిస్తున్నప్పుడు, తనుకూడ అందుకు దీటుగా ప్రతిస్పందించాలనుకున్నాడు. ముస్లిం సోదరులందరూ తక్కిన వారితో కలిసి హోలీ జరుపుకోవాలని ప్రకటించాడు. అంతే కాదు. అలా జరుపుకునే వాళ్ళతో కలిసి తను ముందువరుసలో మొదటి వ్యక్తిగా నిలబడ్డాడు. ఆనందోత్సాహాలు వెల్లి విరిశాయి. ఆ రోజు నుంచి ప్రజలందరూ కలిసి అమితోత్సాహంతో హోలీ జరుపుకోవడం లక్నోలో ఆనవాయితీగా వస్తున్నది.



ఒక పండుగ-భేదాలన్నిటినీ మరిచి పోయి ప్రజలందరూ కలిసి ఆనందోత్సాహాలతో సంగీత నృత్య వినోద కార్యక్రమాలలో పాల్గొనేలా చేయగలదు అంటే అంతకు మించి మరేం కావాలి? చందమామ పాఠకులకు హోలీ శుభాకాంక్షలు! ప్రత్యేకమైన ఆ రోజున ఆనందోత్సాహాలలో తేలియాడండి!



# పాతాళదుర్గం

## 8

*[ఉగ్రసేనుడి రాజభవనాన్ని కదంబపౌరులు ఆక్రమించుకుని, కోశాగారం కొల్లగొట్టారు. తరవాత వాళ్ళు రాజు కోసం అరణ్యంలోకి బయలుదేరారు. ధూమకసోమకులు పరిస్థితులను వివరించి వాళ్ళను శాంతపరిచి తిప్పి పంపారు. ధూమకుడి నడుము నుంచి వేలాడుతున్న మంత్రదండం ఉన్నట్టుండి గాలిలోకి లేచింది. సోమకుడు దాన్ని పట్టుకోడానికి పైకెగిరాడు. -తరవాత]*

సోమకుడు గుర్రం మీది నుంచి ఒక్క ఎగురు ఎగిరి గాలిలో తేలిపోతున్న మంత్ర దండాన్ని పట్టుకోగలిగాడు. కాని, ఈలోపల గుర్రం పక్కకు పోవటంతో అతడు దభీ మంటూ కింద పడిపోయాడు. అయినా, సోమకుడు మంత్రదండాన్ని మాత్రం తన గుప్పెట నుంచి వదల లేదు. ఈలోపల ధూమకుడు గుర్రం నుంచి కిందికి దూకి, ''బలే, సోమూ ! మెలకువ అంటే అలా వుండాలి. ఒక్క ఊపున అది నడుముకు కట్టిన తాడు తెంచుకోవటంతో, ఏం జరగు తున్నదీ నేను గ్రహించలేక పోయాను. మొత్తం మీద కాలశంబరుడి మంత్రదండం మహత్తు గలదే!'' అన్నాడు.

సోమకుడు మంత్రదండంపట్టుకుని లేచి నిలబడ్డాడు. అది అతడి గుప్పెట పట్టు నుంచి బయటపడేందుకు పాములాగా అటూ ఇటూ మెలికలు తిరగసాగింది. అంతేకాక

'చందమామ'



దానిలో నుంచి అస్పష్టమైన ధ్వనులేవో బయ ల్వెడలసాగినై. ధూమకుడు దాని కేసి పరీక్షగా కొంచెంసేపు చూసి, ''సోమూ! నాకో ఆలోచన వచ్చింది. కాలశంబరుడు దీని కోసం ఏవో మంత్రాలు జపిస్తున్నాడు. అందుకే ఇది అతణ్ణి చేరేందుకు ప్రయత్నిస్తున్నది,'' అన్నాడు.

''మనం ఇది చూపే దారి వెంటబడి పోతే, ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోవచ్చు కదా?'' అన్నాడు సోమకుడు మంత్రదండాన్ని ధూమకుడి కిస్తూ.

''అదెలాసాధ్యం? దీనితోపాటు గాల్లోకి మనం ఎగరలేం కదా! ఇప్పుడిది ఎగిరిపో చూసిన దిక్కు తూర్పు. అవునా?'' అన్నాడు ధూమకుడు. సోమకుడు అవునన్నట్టు తల వూపాడు.

''ఇందులో మహత్తు వున్న సంగతి రహ స్యంగా వుంచుదాం. రాజకుమార్తె కాంతి సేనను వెతికి తెచ్చే బాధ్యత మనపైన పడింది కదా. ఈ మంత్రదండం అందుకు మనకు సహాయపడవచ్చు,'' అన్నాడు ధూమకుడు.

ఆ తరవాత ఇద్దరూ గుర్రాలెక్కి మంత్రి గంగాధరుడున్న ప్రాంతానికి వెళ్ళారు.

''తిరుగుబాటుదార్లను, ఏ రక్తపాతం లేకుండా కదంబనగరానికి తిప్పి పంపి నందుకు మీ ఇద్దర్నీ అభినందిస్తున్నాను. కాని, వాళ్ళకు మీరు చేసిన వాగ్దానం నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. రాజకుమారి కాంతి సేనను, రాక్షసుడి బారి నుంచి మీ రెలా విడిపించి తీసుకురాగలరు?'' అని అడి గాడు మంత్రి గంగాధరుడు.

''అందుకు ప్రయత్నిస్తాం, ప్రభూ! ఆ ప్రయత్నంలో చావటానికైనా మేం సిద్ధమే,'' అన్నాడు ధూమకుడు.

''ఇద్దర్లో నువ్వు నాయకుడిలా కనిపిస్తు న్నావ్. నా కుమార్తెను తేగలిగావంటే, నీకు అర్ధరాజ్యం ఇస్తాను, ధూమకా!'' అన్నాడు రాజు ఉగ్రసేనుడు.

''ఒకటి; మీ కిప్పుడు రాజ్యమే లేదు. రెండు; ఉన్నా – మీ నుంచి నేను అర్ధరాజ్యం ఆశించటం లేదు,''అన్నాడు ధూమకుడు కోపంగా.

కదంబమంత్రీ, కోశాధికారీ కొరకొర చూస్తూ, ధూమకుడి కేసి ఒకడుగు వేయ బోయేంతలో గంగాధరుడు వాళ్ళను ఆపి, ''చింత చచ్చినా పులుపు చావలేదంటారే,

అదే ఇది,'' అని తన సైనికుల కేసి తిరిగి, ''ఉగ్రసేన మహారాజునూ, ఆయన పరివారాన్నీ మన నగరానికి తీసుకుపోయి విందులు ఏర్పాటు చేయండి,'' అని ఆజ్ఞాపించాడు.

రాజు ఉగ్రసేనుడూ, అతడి మంత్రీ, బయలుదేరి కుంతల సైనికుల వెంట బయలుదేరి కొండవాగు దాటగానే, మంత్రి గంగాధరుడు ధూమకుడితో, ''మీ ఇద్దరికీ నేను కుంతల రాజ్య సైనికుల దుస్తులు ఇస్తున్నాను. అంతేకాక, మీరు కుంతల రాజుగారి పని మీద వెళుతూన్నట్టు పత్రం ఒకటి ఇస్తాను. ఆ విధంగా మీకు అవసర సమయంలో ఏ మహారాజు నుంచయినా సహాయం పొందే వీలుంటుంది,'' అన్నాడు.

ధూమకు డందుకు కృతజ్ఞత తెలియపరిచాడు. సేనానాయకుడు తెప్పించిన సైనికదుస్తులు, ధూమక సోమకులకు ఇవ్వబడినై. వాళ్ళిద్దరూ ఆ దుస్తులు ధరించారు. తరవాత మంత్రి దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళబోతూ ధూమకుడు, ''ప్రభూ! తమ కుమారుడు శశికాంతుడి మాటేమిటి? అతడు సజీవుడనే మనం భావించాలి గదా?'' అన్నాడు.

''అందులో సందేహం లేదు. శశికాంతుణ్ణి కాలశంబర మాంత్రికుడు వెంట తీసుకుపోయాడని నా నమ్మకం. మీరు రాక్షసుణ్ణి వెతికి పట్టుకుంటే, కాంతిసేన ఎక్కడున్నదీ తెలుస్తుంది. ఇకనేను మాంత్రికుడు ఎక్కడున్నదీ కనుక్కోవాలి. ఆ పనికి శశికాంతుడి మిత్రుడైన భద్రుడనే వాణ్ణి కొంత సైనిక



సహాయం ఇచ్చి పంపుతాను,'' అన్నాడు మంత్రి గంగాధరుడు.

ధూమకుడు ఆ మాటల కేమీ జవాబు చెప్పకుండా, గంగాధరుడికి నమస్కరించి, సోమకుణ్ణి వెంటబెట్టుకుని తూర్పుదిక్కుగా బయలుదేరాడు. అతడి ఉద్దేశం మాంత్రికుడెక్కడున్నదీ తెలుసుకోగలగితే, అతడి ద్వారా కుంభీరుడి నివాస స్థానం కనుక్కోవడం సులభం అని. వాళ్ళిద్దరి మధ్యావున్న వైరం, వాళ్ళ సంభాషణ తీరూ ధూమకుడికి ఇలాంటి అభిప్రాయం కలిగించింది.

ధూమక సోమకు లిద్దరూ కొండదారుల వెంట ప్రయాణించి, మిట్టమధ్యాహ్నం వేళకు ఒక మహారణ్యంలో ప్రవేశించారు. అక్కడ వారి కొక సెలయేరు కనిపించింది, ఆ సెలయేటి ఒడ్డున వెంట తెచ్చుకున్న ఆహారం



తిని చెట్ల కింద కొంచెంసేపు విశ్రాంతి తీసుకుందామనుకున్నారు వాళ్ళు.

ఇద్దరూ గుర్రాలు దిగి వాటిని చెట్లకు కట్టివేసి, ఏటిని సమీపించేంతలో, ఇసుకలో వారికి కొన్ని పాదాల గుర్తులు కనిపించినై. వాటిల్లో ముఖ్యంగా ఒకటి ధూమకుడి దృష్టిని ఆకర్షించింది. అది మామూలు పాదాల గుర్తు కాదు, పావుకోళ్ళు ధరించిన కాళ్ళ గుర్తులు. ధూమకుడు ఆశ్చర్య సంభ్రమాలతో వాటిని పరీక్షించసాగాడు. సాధారణంగా సాధువులూ, యోగులూ మాత్రమే పావుకోళ్ళు ధరిస్తారు. ఈ మహారణ్యంలో అలాంటివారి కేమి పనుంటుంది? పోతే, ఇవి మాంత్రికుడు కాలశంబరుడి పావుకోళ్ళ గుర్తులై వుండాలి. ఆ పక్కల నున్నవి శశికాంతుడి పాదాల గుర్తులై వుండొచ్చు.

"సోమూ, ఇవి కాలశంబరుడి పావుకోళ్ళ గుర్తులే, సందేహం లేదు," అన్నాడు ధూమకుడు.

సోమకుడు అడ్డంగా తలాడిస్తూ, "మనం తప్పుదారి పట్టాం ధూమూ! రాజకుమార్తెను ఎత్తుకు పోయింది రాక్షసుడు గదా? మనం వెతికి తెస్తామన్నది ఆమెను. మరి, ఈ మాంత్రికుడికోసం గాలించటం ఎందుకు?" అన్నాడు.

ధూమకు డతనికి తన అభిప్రాయం వివరించాడు: రాక్షసుడెటుపోయిందీ తెలుసుకునేందుకు ఆధారమే లేదు. కాని, మంత్రదండం ఉన్నది గనకా, అది తూర్పుదిక్కుకు ఎగిరి పోయేందుకు ప్రయత్నం చేసింది గనకా, కాలశంబరుణ్ణి వెతికి పట్టుకోవడం కొంత తేలిక. అతడి ద్వారా కుంభీరుడు వుండే ప్రదేశం తెలుసుకోవచ్చు.

"అవును, ఇదీ నిజమే!" అంటూ సోమకుడు తలవూపాడు. ధూమకుడు సెలయేటి ఒడ్డుకు పోయి దాహం తీర్చుకుని, నీళ్ళల్లో దిగి అవతలి ఒడ్డుకు పోయాడు. నీరు మోకాళ్ళ లోతు మాత్రమే వున్నది. ఏటి కవతల ఇసుకలో కూడా ధూమకుడికి పావుకోళ్ళ గుర్తులు కనపించినై. అతడు సోమకుడికి ఏరు దాటి రమ్మని సంజ్ఞ చేశాడు. సోమకుడు దగ్గిరకు రాగానే, అతడికి ఆ గుర్తులు చూపిస్తూ, "మాంత్రికుడు ఈ సెలయేరు దాటిపోయి ఎంతో కాలం అయి వుండదు. మనం ఇక్కడ భోజనం కోసం ఆగకుండా ముందుకు పోతే అతణ్ణి కలుసుకునే అవకాశం వుండొచ్చు," అన్నాడు.

‘‘సరే, అలాగే చేద్దాం. గుర్రాలను తీసుకొస్తాను,’’ అంటూ సోమకుడు వెనక్కు తిరగబోయేంతలో, దాపులనున్న చెట్ల చాటునుంచి ఎవరో పెద్దగా చప్పట్లు చరచిన శబ్దమైంది. ధూమక సోమకులు కత్తులు దూసి, ఆ శబ్దం వచ్చిన చెట్ల కేసి పరిగెత్తి వాటి వెనక వెతికారు, కాని అక్కడ ఎవరూ లేరు. వాళ్ళు ఆశ్చర్య పడుతూ వెనక్కు తిరిగేంతలో, మరొక వైపు నుంచి చప్పట్లూ, ఈలలూ వినిపించినై. ధూమక సోమకులు ఈసారి జాగ్రత్తగా అడుగులో అడగు వేసుకుంటూ ఆ వైపుకు బయలుదేరారు. వాళ్ళా విధంగా కొద్ది దూరం వెళ్ళేసరికి, ఈ సారి చప్పట్లు వాళ్లకు కుడివైపునున్న చెట్ల చాటు నుంచి వినబడినై.

‘‘సోమూ, మన నెవరో చుట్టుముట్టి హతమార్చాలని చూస్తున్నారు. మనం సెల యేటి దగ్గిరకు పోవటం మంచిది. అక్కడ మన మీద ఎవరూ దొంగచాటుగా వచ్చి దెబ్బతీయలేరు,’’ అన్నాడు ధూమకుడు. ఆ వెంటనే ఇద్దరూ పక్కకు తిరిగి ఏటి కేసి పరిగెత్త బోయేంతలో ఈలలూ, చప్పట్లతో బాటు అరణ్యం ప్రతిధ్వనించేలా కేకలు వినిపించినై. ఆ వెంటనే నలుగురైదుగురు ఆటవికులు చెట్లకొమ్మల్లోంచి వాళ్ళ మీదికి దూకారు. మరి కొందరు ఆటవికులు అడవి దద్దరిల్లేలా పెడబొబ్బలు పెడుతూ వాళ్ళను చుట్టుముట్టారు.

ధూమక సోమకులు ఒకళ్ళ నొకళ్ళు హెచ్చరించుకునే అవకాశం కూడా లేదు. ఇద్దరూ ఒకేసారి, ‘‘జై, కాళేరమ్మా!’’ అంటూ ఆటవికుల మీద విరుచుకు పడ్డారు. వాళ్ళ చేతుల్లోని వాడికత్తులు మెరుపు వేగంతో ఎదురైన ఆటవికుల్ని తునాతునియలు చేయసాగినై. మీద పడి పట్టుకోవాలని



చూసిన ఆటవికులు, ధూమక సోమకులు శరీరాలు విదిలించే సరికి గాలిలోకి లేచి అల్లంత దూరాన చెట్లల్లో దభీమంటూ పడ సాగారు.

ఒకటి రెండు నిమిషాలు గడిచినై. ఎంత బలం, ధైర్యం, కత్తియుద్ధంలో నేర్పూ వున్నా, తోడేళ్ళ గుంపులా వచ్చి మీద పడే ఆటవికుల ధాటికి ధూమక సోమకులు తట్టుకుని నిల బడటం కష్టమైంది. ఆటవికులు విసిరిన బల్లాల్లో ఒకటిరెండు వాళ్ళకు తగిలి, గాయాల నుంచి రక్తంకారసాగింది. చివరకు కత్తి తిప్పేం దుక్కూడా వీలు లేకుండా ఆటవికులు గుంపుగా కట్టకట్టుకు వచ్చి మీద పడి వాళ్ళి ద్దర్నీ పట్టుకున్నారు.

ఆటవికుల ఆనందానికి మేర లేదు. వాళ్ళల్లో చచ్చినవాళ్ళు కొందరు చచ్చారు, కొందరుగాయపడి కేకలు పెడుతున్నారు. మరి కొందరు నడుములు విరిగీ, కీళ్ళు తొలిగీ మూలుగుతున్నారు. అయినా, మిగతా ఆటవికులు ధూమకసోమకుల్ని పట్టుకున్నా మనే ఆనందంలో కేరింతలు కొడుతూ, వాళ్ళ చుట్టూ చేరి గెంతులు వేయసాగారు.

దూరంగా తప్పెట మోగిన ధ్వని అయింది. గెంతులు వేసే వాళ్ళల్లో కొందరు ఆ ధ్వని వచ్చిన దిక్కు కేసి తిరిగి, ''విరూపా! విరూపా!'' అని కేకలు పెట్టారు. కొద్ది సేపట్లో అక్కడికి ఒక ఆజానుబాహువయిన ఆట వికుడు చేతిలో బల్లెం పట్టుకు వచ్చి, ''ఆహ్హా శాంభవీ!'' అంటూ భీకరంగా అరిచి, కళ్ళె ర్రచేసి, పళ్ళు పటపటా కొరుకుతూ, బల్లెం ఎత్తి ధూమక సోమకుల్ని పొడిచేందుకు ముందుకు ఉరికాడు.

ధూమక సోమకులు తమ అంతం సమీ పించిందని గ్రహించి, మనసులో పెళ్ళాం బిడ్డల్ని ఒక్కసారి తలుచుకుని, గుండె రాయి చేసుకుని కళ్ళు మూసుకున్నారు. గుండెల్లో ఆటవిక నాయకుడి బల్లెంపోటు పడుతుం దని ఎదురు చూసిన వాళ్ళిద్దరికీ గొప్ప ఆశ్చర్యం కలిగింది. ఆటవికుల నాయకుడు విరూపుడు, బల్లెం ఎత్తిన వాడల్లా దాన్ని జారవడిచి, ''అయ్యా, దొర బాబులూ! నా వాళ్ళ తప్పులు మన్నించండి, తెలియక చేశారు,'' అంటూ వాళ్ళపాదాల ముందు సాష్టాంగపడిపోయాడు. – (ఇంకావుంది)






# హేమచంద్రుడి ప్రవర్తన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల ప్రశంసా పాత్రమైనదే కాని, అది చివరి వరకు ఉంటుందా అన్న అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే వెనకటికి హేమచంద్రుడనే రాజు ప్రజాకంటకుడైన నేరస్థుణ్ణి పట్టుకుని శిక్షించి తీరాలన్న పట్టుదలతో ఎంతగానో ప్రయత్నించి, ఆఖరికి ఒక అతివ అందానికీ, ఆమె మాటకారితనానికీ మోసపోయి శిక్షార్హుణ్ణి సత్కరించడానికి నిర్ణయించాడు. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు ఆ వింత కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:



హేమచంద్రుడు పరిపాలించే మనోరథపుర రాజ్యంలో కొంత కాలంగా బడబాగ్ని అనే బందిపోటు దొంగ ఆగడాలు ఎక్కువయ్యాయి. దొంగను పట్టుకోవడానికి రాజు అనేక విధాలుగా ప్రయత్నించాడు గాని ఫలితం కనిపించలేదు.

ఒకనాటి అర్ధరాత్రి సమయంలో బడబాగ్ని రాజధాని నగరంలోని ఒక ధనవంతుడి ఇంట్లోకి జొరబడ్డాడు. అలికిడికి ఇంటి యజమాని మేల్కొని కేకలు వేశాడు. ఆ సమయంలో అదే వీధిలో మారువేషంలో సంచరిస్తున్న రాజు హేమచంద్రుడు అప్రమత్తుడయ్యాడు. తాడు సాయంతో పైఅంతస్థు నుంచి కిందికి దిగుతూన్న దొంగను పట్టుకోబోయాడు. అయితే దొంగ, ''గురువర్యా, బడబాగ్నీ! నువ్వేమో పారిపోతున్నావు. నేను చిక్కుకున్నా,'' అంటూ కేకవేయడంతో రాజు అటుకేసి తిరిగి చూశాడు. అదే అదునుగా బడబాగ్ని, ఒక్క గెంతున రాజు వదిలి వచ్చిన గుర్రాన్ని ఎక్కి దౌడు తీశాడు.

తన తప్పిదాన్ని గ్రహించిన రాజు అంగరక్షకుడి గుర్రాన్ని తీసుకుని బడబాగ్నిని వెంబడించాడు. తెల్లవారుతూండగా ఇద్దరూ నగర శివార్లను దాటి పోయారు. అలిసిపోవడం వల్ల, గుర్రాన్ని వదిలి దొంగ అడ్డ దిడ్డంగా పరిగెత్త సాగాడు. రాజు కూడా వాడి వెంట పరిగెత్తాడు. కాలికి రాయి తగలడంతో దొంగ తూలిపడ్డాడు. వెంటనే రాజు మొలలో ఉన్న చురకత్తి తీసి గురిచూసి దొంగ కేసి విసిరాడు. అనుకోకుండా అదే సమయంలో పొలానికి వెళుతూన్న ఒక పల్లెపడుచు దానిని చూసి తన చేతిలోని గంపను కత్తికి అడ్డంగా పట్టడంతో, కత్తి పక్కకు తొలగిపోయింది. దొంగ తప్పించుకుని మొక్కజొన్న తోటలోకి దూరి కనిపించకుండా పోయాడు.

మెరుపు తీగలా కనిపించిన ఆ పల్లెపడుచు నిరుపమాన సౌందర్యవతి. ఆమె అందం చూసి రాజు ఒక్క క్షణం మైమరచి పోయాడు. వెంటనే కర్తవ్యం గుర్తుకు వచ్చి, ''నీ పేరేమిటి?'' అని అడిగాడు.

''జలజ,'' అన్నది ఆ యువతి.

''ఒక దొంగకు సాయపడి నేరం చేశావు. తెలుసా?'' అన్నాడు రాజు కోపంగా.

''దొంగయితే పట్టుకుని విచారించి తగిన శిక్ష విధించాలి. అంతేగాని, చంపేహక్కు ఎవరికీ లేదు,'' అన్నది యువతి.

''రాజుకు కూడా లేదా?'' అని అడిగాడు రాజు. ''రాజయినా ధర్మానికి అతీతుడు కాడు కదా? ధర్మంగా నడుచుకున్నప్పుడే మహోన్నత మైన ఆ పదవికి వన్నె చేకూరుతుంది,'' అన్నది యువతి.

''ధర్మశాస్త్రాలను ఔపోసన పట్టినట్టు మాట్లాడుతున్నావు. అందానికి తీసిపోని వాక్పటిమ కనబరుస్తున్నావు. కానీ ఏం లాభం? రాజు శిక్షనుంచి తప్పించుకోలేవు,'' అని హెచ్చరించి రాజు వెళ్ళిపోయాడు.

మరునాడే రాజభటులు, జలజ గ్రామానికి వెళ్ళి, ఆమె తండ్రి, ''మా అమ్మాయి అన్నెం పున్నెం ఎరుగని అమాయకురాలు,'' అని ఎంత ప్రాథేయపడినా వినకుండా ఆమెను బంధించి రాజు సమక్షానికి తీసుకు వచ్చారు. రాజు జలజకు ఆరు నెలల కఠిన కారాగార శిక్ష విధించాడు.

రాజుకు సవాలు విసురుతూ మరుసటి రోజే నగరంలో ఒక ఇంటిని దోచుకున్నాడు బడబాగ్ని. దాన్ని అడ్డుకోలేనందుకు రాజు ఎంతగానో బాధ పడ్డాడు. మంత్రి రాజు ఆవేదనను గుర్తించి, ''రాజా, బడబాగ్ని స్థావ రాన్ని కనిపెట్టగలిగితే, వాడి ఆట కట్టించ వచ్చు. ఆ పనికి మన గూఢచారులను పంపుదాం,'' అని సలహా ఇచ్చాడు.

రాజు బాగా ఆలోచించాక తనే కోయదొర వేషం వేసుకుని, అడవులకు దగ్గరగా ఉన్న పల్లెల్లో జ్యోతిషం చెబుతున్నట్టు నటిస్తూ బడబాగ్ని స్థావరం ఆచూకీ కనుగొని రవ్వల కొండ గుహను చేరుకున్నాడు. అక్కడ జలజ





కనిపించడంతో, ''చెరసాల నుంచి ఎలా తప్పించుకున్నావు?'' అని అడిగాడు అమితాశ్చర్యంతో.

''భూత భవిష్యత్ వర్తమానాలను చిటికలో చెప్పగల గొప్ప జ్యోతిష్కులైన తమకు ఆమాత్రం తెలియదా? నిజం నిగ్గు తేలాలంటే నిశిత దృష్టి ఉండాలి. సాధ్యాసాధ్యాలను విశ్లేషిస్తే పటిష్ఠమైన చెరసాల నుంచి ఒక సాధారణ యువతి బయట పడడం సాధ్యం కాదనీ, అక్కడ ఉన్నది నాలాంటి మరో యువతి అనీ కోయదొర వేషంలో ఉన్న మహారాజులైన తమకు అర్థంకాక పోదు,'' అన్నది ఆ యువతి.

''చెరసాలలో ఉన్నది నువ్వు కాకపోతే అది ఎవ్వరు? నీలాంటి యువతే నీ కోసం బందీగా ఎందుకు ఉన్నది?'' అని అడిగాడు రాజు.

''అది మా అక్క జలజ. నా పేరు వనజ. మేము కవలలం. ఆమె చాలా అమాయకురాలు. నేనే ముందుజాగ్రత్తకొద్దీ మీతో నా పేరు జలజ అని చెప్పాను. నేను చిక్కుల్లో పడితే విడిపించడం మా అక్క చేతకాదు. ఆమె జైలు పాలయ్యాక ఆమెను విడిపించే మార్గం అన్వేషించాను. గజదొంగ బడబాగ్ని ఆచూకీ తమకు తెలియజేసి మా అక్కను విడిపించాలనుకున్నాను. గాజులమ్ముతున్నట్టు తిరుగుతూ బడబాగ్ని అసలు వివరాలు తెలుసుకున్నాను. అతణ్ణి చూడడానికే ఇక్కడికి వచ్చి మీకు తారసపడ్డాను,'' అన్నది వనజ.

''బడబాగ్నిని చూశావా? వాణ్ణిపట్టుకోవడం ఎలాగా?'' అని అడిగాడు రాజు.

''చూడలేదు. వాణ్ణి పట్టుకోవడం ఎన్నటికీ సాధ్యంకాదు. ఎందుకంటే వాడు మరణించి చాలా కాలమయింది. బడబాగ్ని పేరుతో ఇప్పుడు వేరొకడు తాజాగా దొంగతనాలు చేస్తున్నాడు. అయినా అతణ్ణి శిక్షించడం మహా పాపమవుతుంది!'' అన్నది ఆ యువతి.

''ఏమిటినువ్వంటున్నది?'' అని అడిగాడు రాజు ఆగ్రహం నిండిన కంఠస్వరంతో.

''ఆగ్రహించకండి మహారాజా! ఆగ్రహం విచక్షణకు అవరోధం కలిగిస్తుంది,'' అన్నది వనజ చిన్నగా నవ్వుతూ.

ఆ నవ్వు రాజుకు ముగ్ధమనోహరంగా కనిపించడంతో వెంటనే శాంతించి, ''అతణ్ణి ఎందుకు శిక్షించకూడదోచెప్పుమరి,'' అన్నాడు.

''చైతన్యుడి గ్రామం పులిపాడు ప్రాంతం చుట్టూ కొండ. అక్కడి రైతులకు వర్షమే ఆధారం. అయినా సకాలంలో వర్షాలు

కురవవు. కరువు కాటకాలు, నిత్యదరిద్రం తాండవిస్తున్నాయి. అయినా కొండ మధ్యలో ఒక జలపాతం ఉంది. వృథాగా వెళ్ళిపోయే ఆ జలపాతం నీటిని కాలువ తవ్వి దారి మళ్ళించగలిగితే గ్రామం సస్య శ్యామలమవు తుంది. అయితే, అలా కాలువ తవ్వడం చాలా కష్టం. పాలకులకు మొరపెట్టుకు న్నారు. కాని ప్రయోజనం కనిపించలేదు. అఖరికి ఆస్తి పరుడైన చైతన్యుడు తన ఆస్తిపాస్తులను అమ్మి కాలువ తవ్వించడానికి పూనుకున్నాడు. మొదట అందరూ అతణ్ణి పిచ్చివాడికింద జమకట్టారు. అతడు తన ఆస్తులన్నీ అమ్మినా కాలువ నాలుగోవంతు మాత్రమే పూర్తయింది. ఆర్థిక సహాయం కోసం అర్థించినా రాజుగారి కరుణ కలుగ లేదు. అనుకున్నది సాధించాలంటే చైతన్యు డికి దొంగతనం తప్ప మరో మార్గం కనిపించ లేదు. దొంగిలించి తెచ్చిన సొమ్మును కాలువ పనులకు వినియోగిస్తున్నాడు. మరో వారం రోజుల్లో కాలువపని పూర్తికానున్నది. ఇప్పుడు అక్కడి ప్రజలకు అతడొక దేవుడు. ఇప్పుడు చెప్పండి. దొంగతనాలు చేసినందుకు చైత న్యుణ్ణి శిక్షించడం పాపం కాదా?'' అన్నది వనజ గంభీరంగా.

ఆ గాంభీర్యంలోనూ వనజ రాజుకు ఎంతో మనోహరంగా కనిపించింది. ఆయన వెంటనే, ''నీ ప్రశ్నలాగే గొప్పగా ఉన్న నువ్వు నాకు నచ్చావు. నీకు సమ్మతమైతే నిన్ను వివాహ మాడతాను. నువ్వు చెప్పినవన్నీ నిజమని తెలియగానే చైతన్యుణ్ణి ఆ ప్రాంతానికి రాజ



ప్రతినిధిగా నియమిస్తాను. సంతోషమే కదా!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

వనజ సిగ్గుతో తలవంచుకుని అందుకు సంతోషంగా అంగీకరించింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఏ ప్రయోజనం కాంక్షించి చేసినా దొంగతనం శిక్షార్హమైన నేరమే. శిక్షార్హుణ్ణి శిక్షించడమే రాజు ప్రధాన కర్తవ్యం. ఉపేక్షాభావంతో ఇలా క్షమించడం వల్ల, ఏవో ప్రయోజనాల నెపంతో మరి కొందరు దుర్మార్గులు మరిన్ని నేరాలకు పాల్పడే అపాయం లేదా? వీటన్నిటినీ విస్మరించి ఒక యువతి అందానికి మైమరచి, ఆమె మాయమాటలు నమ్మి, ఒక నేరస్థుణ్ణి శిక్షించకపోగా పదవితో సత్కరించాలను కోవడం ఒక రాజు చేయతగిన పనేనా? హేమచంద్రుడి విడ్డూరమైన ఈ ప్రవర్తనకు కారణం ఏమిటి? నా సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''న్యాయానికీ, ధర్మానికీ అన్ని వేళలా, అన్ని చోట్లా ఒకే కొల బద్దను ఉపయోగించడం భావ్యం కాదని ధర్మశాస్త్రాలే పేర్కొంటున్నాయి. ఇక్కడ గమనించవలసిన ముఖ్య విషయం చైతన్యుడు దొంగతనాలు చేయడానికి తనే కారణమని రాజు హేమచంద్రుడు గ్రహించగలగడం. రాజైనవాడు ప్రజల కడగండ్లను పెడచెవినిపెట్టడం నేరమే అవుతుంది. అలా తనే నేరస్థుడైనప్పుడు ప్రజల బాగు కోసం దొంగతనాలకు పాల్పడ్డ చైతన్యుణ్ణి ఎలా శిక్షించగలడు? అందుకే ప్రజల క్షేమం కాంక్షించి చైతన్యుడు చేసిన నేరాలను క్షమించడంతో పాటు అతణ్ణి పదవితో సత్కరించడానికి నిర్ణయించాడు. అందులో అక్కడి ప్రజల క్షేమం కూడా ఇమిడి ఉన్నది. ఇక వనజ కేవలం అందాలరాశి మాత్రమే కాదు. నిశిత దృష్టి, ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలు, ధర్మబుద్ధి కలిగిన అపురూప గుణవతి. అందువల్లే హేమచంద్రుడు ఆమెను వివాహం చేసుకోవాలనుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]



# చందమామ కబుర్లు

## కెప్టెన్‌కు విగ్రహం




సినిమా తారలు, క్రికెట్ క్రీడాకారులు అంటే మన దేశంలో చెప్ప లేనంత అభిమానం ఉంటోంది. తమ అభిమాన తారల పట్ల, క్రీడా కారుల పట్ల వీరాభిమానులు ఎప్పుడు ఎలా తమ అభిమానాన్ని వ్యక్త పరుస్తారో చెప్పలేం. అభిమానాన్ని మించిన వాళ్ళ ఆరాధనా భావం అలాంటిది. అమితాబ్ బచ్చన్ అభిమానులు ఆయన గౌరవార్థం ఒక గుడి కట్టడం అలాంటిదే. మన దేశంలో క్రికెట్ క్రీడాకారుల పట్ల కూడా అత్యంత అభిమానం ఉన్నది. వాళ్ళకో ప్రత్యేక హోదా ఉన్నది. ధోనీ అభిమానులు తమ అభిమాన క్రీడాకారుడికి ఏం చెయ్యాలా అని ఆలోచించి ధోనీ స్వస్థలమైన రాంచీలో ఆయనకు గుడికట్టాలని 2008 డిసెంబర్ 20 వ తేదీ నిర్ణయించారు. అయితే, అందుకు ధోనీ తల్లిదండ్రులు అభ్యంతరం తెలపడంతో గుడికి బదులు విగ్రహం, ఆర్ట్ గ్యాలరీ నిర్మించాలని పూనుకున్నారు.

ధోనీ ఫ్యాన్స్ క్లబ్ ప్రెసిడెంట్ జితేంద్ర సింగ్, "ధోనీ నిలువెత్తు విగ్రహాన్ని ఆవిష్కరించి, చిన్నప్పటినుంచి ధోనీ ఫోటోలతో ఆర్ట్ గ్యాలరీ ఏర్పరచనున్నాం," అని చెప్పాడు. ఆగస్ట్ 15 నుంచి ఇది అభిమానుల సందర్శనకు తెరవబడుతుంది.

## మ్యాప్ ఇమేజ్ సర్వీస్ ఇక ఉండదు

మీకు తెలిసిన, తెలియని ప్రాంతాలను గుర్తించడానికి మీలో చాలామంది గూగుల్ ఎర్త్‌ను బ్రౌస్ చేస్తూ ఉంటారు. ఆ సర్వీస్ మీకెంతో ఉపయోగపడి ఉండవచ్చు. అయితే, ఉగ్రవాద దాడుల ప్రమాదం పొంచి వుండే సైనిక స్థావరాలు వంటి రహస్య ప్రదేశాలను ఇలా చూపడం సరికాదని గూగుల్ ఎర్త్ పట్ల వివిధ దేశాల నుంచి విమర్శలు బయలుదేరాయి.




జపానుకు చెందిన కొందరు న్యాయవాదులు, ప్రొఫెసర్లు తమ నగరాల వీధుల వివరమైన ఇమేజెస్ ఇంటర్‌నెట్‌లో చూపడం తమ ప్రైవసీ రైట్స్‌కు భంగకరమనీ, వాటిని వెంటనే ఆపాలనీ గూగుల్ ఇంక్‌ను కోరారు.

కాంపైన్ అగైనెస్ట్ సర్వేలెన్స్ సొసైటీ అనే సంస్థ తమ నగరాల స్ట్రీట్ వ్యూ సర్వీస్‌ను ఆపాలనీ, సేవ్ చేసిన ఇమేజెస్‌ను తొలగించాలనీ గూగుల్‌ను కోరింది.



# భద్రాయువు

మనం మంచివాళ్ళుగా ఉన్నంత మాత్రాన మనుగడ ఒడిదుడుకులు లేకుండా సాగుతుందని రూఢిగా చెప్పలేము. సుఖదుఃఖాలు చాలా వరకు బాహ్యపరిస్థితుల మీద ఆధారపడి ఉంటాయి. చుట్టూ ఉన్న మనుషులు దుష్టస్వభావులయితే ఇక కడగండ్లకు అంతు అంటూ ఉండదు. అయితే, అలాంటి కష్టకాలంలో కూడా ధర్మమార్గం తప్పకుండా ప్రవర్తించినట్టయితే దైవసహాయం తోడై జీవితం సుఖమయం, అర్థవంతం అవుతుందని చాటే అద్భుత ఉదంతం భద్రాయువు జీవితం!

దశార్ణ దేశాధిపతి వజ్రబాహువుకు పలువురు భార్యలు. వారిలో సుమతి అనే భార్య గర్భవతి అయింది. అసూయ చెందిన సవతులు, పరిచారికలను మంచి చేసుకుని సుమతి గర్భస్రావానికి మందు పెట్టారు. అయితే, దాని ప్రభావంతో గర్భస్రావం జరగలేదు గాని, సుమతి ఆరోగ్యం క్షీణించింది. బలహీనమైన మగశిశువును ప్రసవించింది. తల్లీ పిల్లలు అనారోగ్యంతో బాధ పడుతూ ఎప్పుడు చూసినా వేదనతో ఏడుస్తూ కనిపించేవారు. దానిని చూసి చిరాకు చెందిన రాజు వాళ్ళను అడవులలో దించి రమ్మని భటులను ఆజ్ఞాపించాడు.

అడవి నుంచి సుమతి బిడ్డతో సహా వైశ్యపురం అనే పట్టణం చేరింది. అక్కడ ఒక వైశ్యుడి భార్య ఆమెకు ఆశ్రయమిచ్చి ఆదరించింది. అయినా ఒకనాడు సుమతి కొడుకు చచ్చిపోయాడు. పుత్రశోకం తట్టుకోలేక సుమతి భోరున విలపించ సాగింది. ఆ సమయంలో అటుగా వచ్చిన ఋషభయోగి అనే మహనీయుడు ఆమెను ఓదార్చి అశాశ్వతమైన జీవితం గురించీ, క్షణ భంగురమైన శరీరం



గురించీ తత్వబోధ చేశాడు. అయినా ఆమె పుత్రశోకం నుంచి బయటపడలేక తనుకూడా మరణించక తప్పదన్నది. అప్పుడా యోగి ఆమెపై కనికరించి చనిపోయిన బిడ్డ శరీరం మీద ఏదో భస్మం చల్లి బిడ్డను బతికించి అతడికి భద్రాయువు అని నామకరణం చేసి ఆశీర్వదించాడు.

భద్రాయువు శుక్లపక్ష చంద్రుడిలా దిన దిన ప్రవర్ధమానంగా పెరగసాగాడు. అతడికి తను పెరుగుతూన్న ఇంటి వైశ్య కుమారుడితో ప్రగాఢమైత్రి ఏర్పడింది.

ఇలా ఉండగా మరికొన్నేళ్ళకు ఒకనాడు దేశాటన చేస్తూ మళ్ళీ వైశ్యపురం వచ్చిన ఋషభయోగి భద్రాయువుకు శివకవచాన్ని ఉపదేశించి, చంద్రహాసమనే ఖడ్గాన్నీ, శంఖాన్నీ ప్రసాదించాడు.

మరి కొంత కాలానికి మగధరాజు దండెత్తి వెళ్ళి వజ్రబాహువును ఓడించి దశార్ణ దేశాన్ని ఆక్రమించుకున్నాడు. ఆ సంగతి తెలిసిన భద్రాయువు వెంటనే యోగి ప్రసాదించిన ఖడ్గాన్నీ, శంఖాన్నీ తీసుకుని, తన మిత్రుడైన వైశ్య కుమారుణ్ణి సారథిగా చేసుకుని రథంపై వెళ్ళి, ఒంటరిగా మగధరాజును జయించి, దశార్ణ దేశాన్ని తిరిగి తన తండ్రి పరం చేసి వైశ్యపురానికి తిరిగివచ్చాడు. అయితే, తను ఎవరైనదీ తండ్రికి తెలియనివ్వలేదు.

అదే సమయంలో ఋషభయోగి చంద్రాంగదుడనే రాజును కలుసుకుని భద్రాయువు పుట్టుపూర్వోత్తరాలు వివరించి, "నీ కుమార్తె కీర్తిమాలినిని ఆ యువకుడికిచ్చి వివాహం జరిపావంటే శుభం జరుగుతుంది," అని చెప్పాడు.

చంద్రాంగదుడు యోగి మాటలకు సంతసించి భద్రాయువునూ, అతడి తల్లినీ పిలిపించాడు. సంగతి చెప్పి వెనువెంటనే ఘనంగా వివాహం ఏర్పాట్లు చేశాడు. వివాహానికి శుభలేఖలు అందుకుని వివిధ దేశాల రాజులతో పాటు దశార్ణ దేశాధిపతి వజ్రబాహువు కూడా వచ్చాడు. ఆయన వరుణ్ణి చూసి, మగధ రాజును ఓడించి తనకు రాజ్యం ఇప్పించిన యువకుడు అతడే అని గుర్తుపట్టి, "ఇతడు ఎవరి కుమారుడు?" అని అడిగాడు.

"నీ కుమారుడే!" అంటూ చంద్రాంగదుడు వజ్రబాహువుకు అతణ్ణి గురించి తనకు తెలిసినదంతా చెప్పాడు. సుమతిని ఎదుటికి రప్పించాడు.

వజ్రబాహువు తాను చేసిన దానికి పశ్చాత్తాపపడి సుమతినీ, సతీసమేతంగా భద్రాయువునూ తన వెంట దశార్ణదేశానికి తీసుకుపోయాడు. భద్రాయువుకు రాజ్య సింహాసనాన్ని అప్పగించాడు.

భద్రాయువు ప్రజలకు ఎటువంటి కొరతా లేకుండా రాజ్యపాలన చేయసాగాడు.

ఒకనాడు భద్రాయువు భార్యతో కలిసి వనవిహారానికి వెళ్ళి, అక్కడి సుందర దృశ్యాలను చూసి ఆనందించి మిట్ట మధ్యాహ్నానికి ఒక చెట్టు నీడన విశ్రమించాడు.

హఠాత్తుగా, ''రక్షించు! రక్షించు!'' అన్న ఆర్తనాదంవిని లేచి నిలబడి తిరిగిచూశాడు.

''నా భార్యను పులి ఈడ్చుకు పోతున్నది, రక్షించు, రక్షించు,'' అంటూ ఒక బ్రాహ్మడు దాని కేసి చూపాడు.

భద్రాయువు ఎన్ని బాణాలు వదిలినా ప్రయోజనం లేకపోయింది. పులి బారి నుంచి బ్రాహ్మడి భార్యను విడిపించలేకపోయాడు.

''పులి బారిన పడ్డ ఒక అబలను రక్షించలేక పోయావు, నువ్వా ఒక రాజువేనా? నీ చంద్రహాసమెక్కడ? శంఖం ఏమయింది? రాజు చేతగానివాడయితే ప్రజలు జీవించేదెలా?'' అంటూ బ్రాహ్మడు రకరకాలుగా నిందించ సాగాడు.

భద్రాయువు బ్రాహ్మడి కేసి తిరిగి, ''క్షమించండి! మీ భార్యను కాపాడలేక పోయాను. అందుకు బాధపడుతున్నాను. అయినా, ఇప్పుడు కూడా మించిపోయిందేమీ లేదు! ప్రస్తుతం నా దేహమూ, నా భార్యా, నా రాజ్యమూ నా అధీనంలో ఉన్నాయి. వీటిలో ఏది కావాలన్నా తీసుకోండి!'' అన్నాడు.

బ్రాహ్మడు పరమానందం చెంది, ''నీ ధర్మనిరతికి సంతోషించాను. నువ్వు చూసినదంతా నిజం కాదు. నీ ధర్మబుద్ధిని పరీక్షించగోరే ఈ మాయాదృశ్యాన్ని కల్పించాను. పరీక్షలో నువ్వునెగ్గావు. నీ పాలనలో ప్రజలకు ఎలాంటి లోటూ రాదు. నీ వంశం కీర్తి ప్రతిష్ఠలతో వర్ధిల్లుతుంది,'' అని ఆశీర్వదించాడు.

అదే విధంగా భద్రాయువు చిరకాలం తన ధర్మ పరిపాలన కొనసాగించి ప్రజల మన్ననలు పొందాడు.



**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
Go to www.chandamama.com & subscribe now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..............................................................................

Date of Birth: .............................. Sex :..................................

Address: ..........................................................................

..........................................................................................

..........................................................................................

............................................... City: ...................................

State:.......................................... Pin:......................................

Telephone:........................................................................

Mobile:.............................................................................

Email:...............................................................................

Subscription Number 9for renewals):.......................................

Gift Subscription to thè following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees..............................................

Cheque/DD No ..................................................................

favouring Chandamama India Ltd on.........................................

.....................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

మన వారసత్వ స్థలాలు

# తాజ్ మహల్

## చలువరాతి కవిత!



ఆధునిక ప్రపంచ ఏడు అద్భుతాలలో ఒకటి తాజ్ మహల్. ఆగ్రాలో యమునా నదీ తీరంలో మొగల్ చక్రవర్తి షాజహాన్ తన భార్య ముంతాజ్ జ్ఞాపకార్థం దీనిని నిర్మించాడు. బ్రహ్మాండమైన తెల్లటి చలువరాతి ఈ స్మారక భవనం 1631–1648 మధ్య కాలంలో నిర్మించబడింది. పర్షియన్, ఒట్టొమాన్, భారతీయ, ముస్లిం శిల్పకళా అంశాల సమ్మేళనంతో నిర్మించబడిన తాజ్‌మహల్‌కు ఉస్తాద్ అహ్మద్ లహోరి రూప కల్పన చేశాడని చెబుతారు. తెల్ల చలువ రాతి గుమ్మటం జగత్ప్రసిద్ధి గాంచినదే అయినప్పటికీ, నిజానికి పలు నిర్మాణాల సమాహారంగానే దీనిని చెప్పాలి.

అరవై బిఘాల విస్తీర్ణంగల ఈ ప్రాంగణం దక్షిణం నుంచి ఉత్తరానికి యమునా నది కేసి వాలుగా, అవరోహణ క్రమ అంతస్థులుగా ఉంటోంది. రెండవ అంతస్థులో చతురస్ర ఉద్యానం ఉంటోంది. ఇది లోతులేని కాలువలతో నాలుగుగా విభజించబడి ఉన్నది. వీటిని చార్‌బాగ్ అంటారు. ప్రధాన గోరీ నాలుగు మూలలతో చతుస్రాకారంలో ఉంటుంది. మూలలలో ఒకదానికొకటి ఎదురెదురెదురుగా మినారెట్లు ఉన్నాయి. పడమటి దిశలో ఉన్న ఎర్ర సున్నపురాయి సమాధి వ్యతిరేకమైన రంగుతో ప్రత్యేక సౌందర్యాన్ని సమకూరుస్తున్నది. డాడోల మీద, సెనటాఫ్‌ల మీద, వాటి చుట్టూ ఉన్న చలవరాతి జర్ఝూరీ తెరమీద కొన్ని అద్భుతమైన లోపలి, వెలుపలి కళాఖండాల నమూనాలు కనిపిస్తాయి.

1983 లో తాజ్‌మహల్ యునెస్కో ప్రపంచ వారసత్వస్థలంగా స్వీకరించబడింది. ''భారత దేశంలోని ముస్లిం శిల్పకళ ఆభరణంగా; కళాఖండాలుగా విశ్వవ్యాప్తంగా అభిమానించబడే ప్రపంచ వారసత్వ స్థలాలలో ఒకటిగా'' పేర్కొనబడింది.

ఉదయం 6గం.ల నుంచి సాయకాలం 7గం.ల వరకు సందర్శకులకు తెరువ బడి ఉంటుంది. శుక్రవారం మూసి ఉంటుంది. రంజాన్ మాసంలో తప్పతక్కిన పౌర్ణమినాడు, అంతకు ముందూ, తరవాతా రెండు రోజులు రాత్రుల్లో చూడడానికి అనుమతిస్తారు.

ప్రవేశరుసుము: భారతీయ పౌరులకూ, సార్క్ దేశాల (బంగ్లా దేశ్, నేపాల్, భూటాన్, శ్రీలంక, పాకిస్తాన్, మాల్దీవులు, ఆఫ్ఘనిస్థాన్) పౌరులకు రూ. 10.లు. పదిహేనేళ్ళ లోపు పిల్లలకు ఉచితం.



# దర్జీ నైపుణ్యం

## బీర్బల్ కథలు : 19

చక్రవర్తి ఆ రోజు ప్రజల కోరతలు వింటున్నాడని తెలియగానే ఒక ముసలావిడ గంపెడాశతో ఆయన్ను చూడడానికి బయలుదేరింది కాపలా భటులు సంగతేమిటని అడిగారు.

''నాయనా, నేను చక్రవర్తిని చూడాలి,'' అన్నది ఆమె ఆయాసంతో రొప్పుతూ.

''నెమ్మదిగా రా,'' అంటూ భటులు ఆమె చేయిపట్టుకుని కొలువుతీరి వున్న చక్రవర్తి సమక్షానికి తీసుకువెళ్ళారు. ఆమె సభలో అడుగుపెట్టగానే, వంగి నేలను తాకి చక్రవర్తికి సలాం చేయడానికి ప్రయత్నించింది.

ఆమె వయసును గమనించిన చక్రవర్తి సింహాసనం నుంచి లేచి, ''ఫరవాలేదు. వచ్చిన పనేమిటో చెప్పు,'' అన్నాడు.

''ఆలంపనా, నా పేరు సుందరీ బాయి. పేద ముసలిదాన్ని,'' అన్నది ముసలావిడ.

''అవన్నీ చూస్తూనే తెలుస్తున్నవి. ఇక్కడ పేదలు, ధనికులు; చిన్నా, పెద్దా తేడాలుండవు. నీకు వచ్చిన కష్టం ఏమిటో చెప్పు,'' అన్నాడు చక్రవర్తి.

''తమరు కాదంటే నాకెవ్వరూ న్యాయం చెయ్యలేరు ఆలంపనా,'' అన్నది ముసలావిడ గద్గద స్వరంతో.

''నన్నేం చెయ్యమంటావో, నీ సమస్య కాస్త గట్టిగా చెప్పు,'' అన్నాడు చక్రవర్తి.

''ఆలంపనా, గత సంవత్సరం బదరీనాథ్ యాత్ర చేసిరావాలనుకున్నాను. ఆరోగ్యం బాగానే ఉందికానీ, వయసు పైబడడం వల్ల కాళ్ళుచేతులు బాగున్నప్పుడే వెళ్ళి వద్దామనుకున్నాను. ముందూ వెనకా ఎవరూ లేరు గనక, ఇన్నాళ్ళు కొద్ది కొద్దిగా కూడబెట్టినదంతా అమ్మి బంగారు మొహరీలుగా మార్చాను. వాటిని ఒక సంచీలో వేసి మూతి బిగువుగా కట్టి లక్కముద్రవేశాను. బాగా ఆరిన తరవాత ఒకసారి ఆడించి చూశాను. దృఢంగా కనిపించింది,'' అని ఆగింది ముసలావిడ.

''ఇంతవరకు చాలా చక్కగా చేశావు. ఆసక్తి కరంగా ఉంది. ఆ తరవాత ఏం జరిగిందో చెప్పు,'' అన్నాడు చక్రవర్తి.

''నేను ఆ సంచీని మన నగరంలో అందరూ గౌరవించే గృహస్థు అయిన గుల్‌షా దగ్గరికి

తీసుకువెళ్ళి తిరిగి వచ్చేంతవరకు భద్రంగా దాచమని వేడుకున్నాను. అతడందుకు అంగీకరించగానే సంచీని తీసి చూపాను. అతడు దాన్ని ముట్టుకోవడానికి ఇష్టపడలేదు. నన్ను వెంటబెట్టుకుని అతడి ఇంటి పెరట్లో ఉన్న పాకలోకి తీసుకుపోయి గొయ్యి తవ్వి దాన్ని అందులో పూడ్చి పెట్టమన్నాడు. చుట్టు పక్కల ఒక్కరూ లేరు. నేను అతడు చెప్పినట్టే చేశాను. 'నీకిక ఎలాంటి విచారమూ వద్దు. తిరిగి వచ్చి నువ్వే దానిని నిక్షేపంగా తీసుకోవచ్చు,' అని చెప్పి పంపాడు.

''కృతజ్ఞతలు తెలియజేసి వచ్చిన నేను తీర్థయాత్ర ముగించుకుని నెల తరవాత తిరిగి వచ్చాను. నాణాల సంచీకోసం గుల్‌షా వద్దకు వెళ్ళాను. నన్ను ఆయన నవ్వుతూ పాకలోకి తీసుకుపోయి, పాతిపెట్టిన చోట తవ్వి సంచీని తీసుకోమన్నాడు. అలాగే తవ్వి తీసుకున్నాను. పూడ్చిపెట్టిన సంచీ అక్కడే ఉన్నది. లక్కముద్ర కూడా చెక్కుచెదరకుండా అలాగే ఉండడంతో సంతోషంగా మళ్ళీ కృతజ్ఞతలు తెలియజేసి ఇంటికి తిరిగి వచ్చాను.

ఇంటికి చేరగానే లక్కముద్ర తొలగించి మూట విప్పి చూడగానే ప్రాణం పోయినట్టయింది. బంగారు నాణాలు కనిపించలేదు. వాటికి బదులు అదే పరిమాణంలో రాగి నాణాలున్నాయి,'' అంటూ ముసలావిడ ఆ తరవాత మాట్లాడలేక భోరున ఏడ్వసాగింది.

''ఏడవకు, ఊరుకో,'' అని ఓదార్చిన చక్రవర్తి సభికుల కేసి తిరిగి, ''ఈ సమస్యను ఎలా పరిష్కరించగలం?'' అని అడిగాడు.

ముసలావిడ ఆత్రుతగా వాళ్ళకేసి చూడసాగింది. సభలోని ఒక్కరూ నోరు విప్పలేదు. ఆఖరికి బీర్బల్ లేచి నిలబడి, ''ఈ మర్మాన్ని నేను ఛేదించగలననుకుంటాను షహేన్‌షా!'' అన్నాడు.

''ఆ నమ్మకం నాకూ ఉన్నది, బీర్బల్,'' అన్నాడు చక్రవర్తి తలపంకిస్తూ.

''షహేన్‌షా, ఆ నాణాల మూటను ఒకసారి పరిశీలించి చూడాలనుకుంటాను,'' అన్నాడు బీర్బల్.

''ఇదిగో సంచీ,'' అంటూ ముసలావిడ సంచీని బీర్బల్ దగ్గరికి తీసుకువెళ్ళి చూపింది.



## మన దేశం క్విజ్

### ఈ విశిష్ట వ్యక్తులు ఎవరో మీకు తెలుసా?




1. మొట్టమొదటి మహిళా ఐపిఎస్ ఆఫీసర్, మెగసెసే అవార్డు విజేత.
2. 'జయ్‌పూర్ ఫూట్' రూపకల్పన చేసిన ఆర్థోపెడిక్ సర్జన్.
3. ఖగోళశాస్త్ర వేత్త; గణితశాస్త్ర వేత్త. మన దేశపు తొలి ఉపగ్రహానికి ఆయన పేరు పెట్టబడింది.
4. పండితుడు, తత్వవేత్త, రాజనీతిజ్ఞుడు; రచయిత. కొన్ని సంవత్సరాలు యునెస్కో అధ్యక్షుడుగా పదవీ బాధ్యతలు నిర్వహించాడు.
5. 'ద్వైత' సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. భగవద్గీతను, ఉపనిషత్తులను సరికొత్త రీతిలో వ్యాఖ్యానించాడు.
6. గాంధేయవాది, స్వాతంత్ర్య యోధుడు. ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌గా ఏడేళ్ళు పదవీబాధ్యతలు నిర్వహించాడు.

(సమాధానాలు 74వ పేజీలో)

బీర్బల్ ఆ సంచీని తీసుకుని తిప్పి తిప్పి కొంతసేపు పరిశీలనగా చూశాడు. ఇందులో ఏదో తిరకాసు ఉంది అనుకుంటూ పెదవులు బిగించి ఆ తరవాత ముసలావిడతో, "నువ్వు చెప్పేది నిజమయితే, నీ నాణాలు నీకు తప్పకుండా వస్తాయి," అని ధైర్యం చెప్పాడు.

"నేను అబద్ధం చెబితే నా నెత్తిన పిడుగు పడి చస్తాను," అంటూ ముసలావిడ చేతులెత్తి ఆకాశం కేసి చూసింది.

"తప్పకుండా నిజాన్ని బయట పెడతాం. ఎల్లుండి రావమ్మా," అన్నాడు చక్రవర్తి.

ముసలావిడ వంగి నమస్కరించి అక్కడి నుంచి వెలుపలికి నడిచింది.

చక్రవర్తి ఆసనం నుంచి లేవగానే సభికులు లేచి నిలబడ్డారు. ఆయన వెలుపలికి నడుస్తూండగా వంగి నమస్కరించారు. ఆ తరవాత బీర్బల్ కూడా ముసలావిడ ఇచ్చిన సంచీ తీసుకుని ఇంటికి బయలుదేరాడు.

తక్కిన సభికులు బీర్బల్ ఈ మర్మాన్ని ఎలా ఛేదిస్తాడో తెలియక మల్లగుల్లాలు పడసాగారు. ఛేదించలేకపోతే బీర్బల్, చక్రవర్తి ఆగ్రహానికి గురికావడం తథ్యమనీ, దాంతో ఉన్న ఉద్యోగం కాస్త ఊడుతుందనీ అసూయాపరులైన వాళ్ళు ఆశతో ఎదురు చూడసాగారు.

సమస్యను పరిష్కరించడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచిస్తూ ఇల్లు చేరిన బీర్బల్‌ను భార్య చిరునవ్వుతో పలకరించింది. బీర్బల్

దాన్ని పట్టించుకోకుండా ముభావంగా తలా డించడంతో తాగడానికి నీళ్ళందించి వంట గదిలోకి వెళ్ళిపోయింది భార్య. బీర్బల్ బట్టలు మార్చుకుని కాళ్ళు చేతులు కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు.

భోజనం అయిందనిపించి, వరండాలో కాస్సేపు అటూ ఇటూ తిరిగాడు. మధ్యాహ్నం కునుకు కోసం వెళ్ళి నడుంవాల్చిన బీర్బల్ మెరుపులాంటి ఆలోచనతో చివుక్కున లేచి కూర్చున్నాడు. వెంటనే కత్తెర తీసుకుని పడక పైతొడుగును ఒకవైపు చకచకా కత్తిరించాడు.

''ఏమిటండీ, బంగారం లాంటి బట్టను అలా కత్తిరించేశారు,'' అంటూ వాపోతూన్న భార్య మాటలను పట్టించుకోకుండా పడక పైతొడుగును జాగ్రత్తగా విడిగా లాగుతూ నౌకరును పిలిచాడు. నౌకరు పరిగెత్తి రాగానే దానిని వాడి చేతికిచ్చి, ''నగరంలో గట్టివాడైన దర్జీ చేతికిచ్చి దీన్ని చక్కగా కుట్టించుకుని రావాలి,'' అన్నాడు.

''మన్సూర్ అలీకి మించిన దర్జీ నగరంలో లేడు. అతడు నేను బాగా ఎరిగినవాడే,'' అని చెప్పిన నౌకరు, ''అవునూ, ఇది తమకెప్పుడు కావాలి?'' అని అడిగాడు.

''రేపు మధ్యాహ్నానికల్లా ఇస్తే చాలు,'' అన్నాడు బీర్బల్.

చెప్పినట్టుగానే మరునాటి సాయంకాలానికల్లా కుట్టిన బట్టతో తిరిగివచ్చాడు నౌకరు. బీర్బల్ దానిని తీసుకుని నాలుగు మూలలా పరిశీలించి, చేత్తో తడివి చూశాడు. తను కత్తిరించిన చోటు తెలియకుండా చాలా చక్కగా కుట్టబడి ఉన్నది. ''చాలా బాగా కుట్టాడు. మన్సూర్ అలీని చూడాలి. రా వెళదాం,'' అంటూ నౌకరును వెంటబెట్టుకుని బయలుదేరాడు.

బీర్బల్‌ను చూడగానే, ''హుజూర్! తమరు ఇంత దూరం రావాలా? ఒక్క మాట చెప్పి పంపి ఉంటే నేనే వచ్చేవాణ్ణి కదా?'' అంటూ లేచి వంగి సలాం చేశాడు మన్సూర్ అలీ.

''అద్భుతమైన నీ పనితనాన్ని మెచ్చుకోవాలనే స్వయంగా వచ్చాను,'' అన్నాడు బీర్బల్ చిన్నగా నవ్వుతూ.

''తమ నోటి గుండా ఆ మాట వినడం నాకెంతో సంతోషంగా ఉంది, హుజూర్,'' అన్నాడు మన్సూర్ అలీ.



''దీన్ని పుచ్చుకో,'' అంటూ బీర్బల్ ఒక మొహరీ అతడి చేతిలో పెట్టాడు.

''నాకు ఇవ్వవలసింది ఇందులో సగమే,'' అంటూ మిగిలిన చిల్లర కోసం జేబులు వెదక సాగాడు మన్సూర్ అలీ.

అంతలో బీర్బల్ ముసలావిడ నుంచి తీసుకున్న సంచీని తీసి మన్సూర్ అలీకి చూపుతూ, ''ఈ సంచీ చిరిగిందని ఎవరైనా వచ్చి కుట్టించుకుని వెళ్ళారా? కాస్త జాగ్రత్తగా చూసి చెప్పు,'' అని అడిగాడు బీర్బల్.

మన్సూర్ అలీ కళ్ళు అతడు కుట్టిన చిరుగు సంచీని చూడగానే కనిపెట్టేశాయి. ''హుజూర్, దాదాపు నెల క్రితం గుల్‌షా ఈ సంచీని తెచ్చి చిరుగును కుట్టించుకుని వెళ్ళాడు,'' అని చెప్పాడు మెరిసే కళ్ళతో.

''చాలా కృతజ్ఞతలు,'' అంటూ బీర్బల్ అక్కడి నుంచి బయలుదేరాడు.

మరునాడు ఉదయం సభాసదులందరూ రాగానే చక్రవర్తి సభలో అడుగుపెట్టాడు. అందరూ లేచినిలబడి ఆయనకు వంగి సలాం చేసి, ఆయన ఆసనంలో కూర్చున్నాక తామూ కూర్చున్నారు. భటులు గుల్‌షాను, ముసలావిడను సభలో ప్రవేశపెట్టారు.

చక్రవర్తి బీర్బల్ కేసి తల తిప్పి, ''ఈ ముసలావిడ ఫిర్యాదులోని నిజానిజాలు నిగ్గు తేల్చావా?'' అని అడిగాడు.

''ఆమె చెప్పింది అక్షరాలా నిజం షహేన్ షా! అందులో ఏమాత్రం అనుమానం లేదు,'' అంటూ బీర్బల్ తను ఆ నిజాన్ని ఎలా



కనుగొన్నదీ చక్రవర్తికి స్పష్టంగా వివరించాడు. గుల్‌షా దిగ్భ్రాంతి చెందాడు. అతడి ముఖం వెలవెల బోయింది. మోకాళ్ళ మీదికి వంగి, రెండు చేతులతో తలను పట్టుకున్నాడు. ఆ తరవాత తలతో నేలను తాకి చక్రవర్తికి సలాం చేశాడు.

''ఇప్పుడైనా నిజం ఒప్పుకో,'' అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

''క్షమించండి ఆలంపనా! దురాశాతో మోసానికి పాల్పడ్డాను,'' అంటూ చక్రవర్తి పాదాలపై బడ్డాడు గుల్‌షా.

''మోసగాణ్ణి క్షమించడమా! పదేళ్ళు కఠిన కారాగారశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు చక్రవర్తి.

ఆ తరవాత ముసలావిడకు చెందవలసిన బంగారు మొహరీలు ఆమెకు అప్పగించబడ్డాయి.




## ఆయుర్వేద పాన్




పటాన్ పట్టణం ఒక సందులో ఉన్న పాన్ షాప్ ఒకటి మనిషి పుర్రె, రెండు ఎముకల అపాయ చిహ్నంతో ఆహ్వానం పలుకుతోంది. ఎందుకో తెలుసా? పొగాకువల్ల వాటిల్లే అపాయాన్ని సూచించడానికి! ఈ షాపు యజమాని రాముకకా పొగాకుకు సంబంధించిన వాటిని అసలు అమ్మడు. వాటికి బదులు ఆరోగ్యాన్ని పెంపొందించే విధంగా ఆయుర్వేద పద్ధతిలో తయారు చేసిన పాన్లు అమ్ముతాడు. కొట్టుకు బయట కాస్త భయానక దృశ్యం కనిపిస్తుందే తప్ప, అతడు చేసే వ్యాపారం మాత్రం ఖాతాదార్లకు మేలు చేసేదే. ఆ బొమ్మ ప్రమాద సూచిగా లేదా అని అక్కడికి వచ్చేవారిని అడిగితే, ''లేదు. అది ఆయన అమ్మే పాన్లకు సంబంధించినది కాదు. రాముకకా సమాజానికి అందించే సందేశం అది. అందుకే టౌనులో అందరూ ఆయన్ను గురించి చర్చించుకుంటున్నారు,'' అని చెబుతారు.

## మెదడుకు పదును పెట్టే క్రీడలు

కొంత కాలం క్రితం పిల్లలు ఆడుకున్న చెమ్మాచెక్కా, బొంగరాలు, అష్టాచెమ్మా, మేక-పులి మొదలైన ఆటల గురించి ఇప్పటి పిల్లలకు అసలు తెలియదు. పిల్లల మేధస్సును పెంచే మన సంప్రదాయ క్రీడలను పునరుద్ధరించాలనే ఉద్దేశంతో వినతా సిద్ధార్థ ముంబయిలో 'క్రీడ' అనే సంస్థను ప్రారంభించి వాటికి సంబంధించిన పరికరాలను మార్కెట్లో ప్రవేశపెట్టారు. ఆ ఆటలకు సంబంధించిన చరిత్ర, నిబంధనలు, నియమాలు కూడా తెలియజేస్తున్నారు. ఉదాహరణకు వైకుంఠ ఏకాదశి నాటి రాత్రి 'పరమపదం' ఆడేవారు. దాన్ని మన జీవితంలోని మంచి చెడ్డల పోరాటానికి సంకేతంగా; నిచ్చెనలు సత్యం, ధర్మం మొదలైన మంచి గుణాలనూ, పాములు దుష్ట శక్తులనూ సూచిస్తాయని చెబుతున్నారు.



## రష్యా జానపద కథ

# బంగారు చేప

సముద్ర తీరంలోని ఒక పాత ఇంట్లో వృద్ధ దంపతులు నివసిస్తూండేవారు. ''తినడానికి రొట్టె ముక్కలేదు. ఈ ఇంటి కప్పు ఎప్పుడు పైన కూలుతుందో ఏమో,'' అంటూ ముసలావిడ పొద్దస్తమానం గొణుగుతూ ఉండేది. ముసలాయన భార్యకేసి విచారంగా చూస్తూ బోసి నోటితో నవ్వేవాడు. ఆ తరవాత గాలం తీసుకుని సముద్రంలోకి చేపల వేటకు బయలుదేరేవాడు. కొన్ని రోజులు రెండు మూడు చేపలు దొరికేవి. ఒక్కొక్కసారి ఒక్క చేప కూడా దొరికేది కాదు.

అలా ఒకనాడు అతడు ప్రశాంత జలంలో గాలం వేస్తూండగా తను కూర్చున్న పడవ కొద్దిగా కదిలినట్టయింది. ముసలాయన గాలాన్ని పైకి లాగాడు. గాలానికి అందమైన బంగారు చేప! ముసలాయన ఆనందంతో అందుకోబోయాడు. ''అయ్యా, నన్ను వదిలి పెట్టు!'' అన్నది చేప మనిషి కంఠస్వరంతో. ముసలాయన అమితాశ్చర్యంతో బోసినవ్వు నవ్వాడు. ''నన్నువదిలి పెట్టావంటే నువ్వు కోరినది ఇస్తాను,'' అన్నది చేప మళ్ళీ.

ముసలాయన మెల్లగా తల పంకించి, ''నీ నుంచి నాకేమీ అవసరం లేదు. నువ్వు హాయిగా వెళ్ళి పో,'' అంటూ దాన్ని నీళ్ళలోకి వదిలి తీరం కేసి బయలుదేరాడు.

ఇంటిని సమీపిస్తూండగా అతణ్ణి చూసిన ముసలావిడ, ''ఇంట్లో తినడానికి ఏమీ లేదు. ఆకలితో చస్తున్నాను. నువ్వేమో ఒక్క చేప కూడా లేకుండా చేతులూపుకుంటూ వస్తున్నావు,'' అని గగ్గోలు పెట్టింది కోపంతో.



''ఈ రోజు ఒకే ఒక చేప దొరికింది. అదీ బంగారు చేప! దాని రెక్కలు, తోక మిలమిలా మెరుస్తున్నాయనుకో!'' అన్నాడు ముసలాయన ఎంతో సంబరంగా. ''బంగారు చేపా? ఎక్కడది?'' అని అడిగింది ముసలావిడ ఆత్రుతగా.

''నీళ్ళలోనే వదిలేశాను. అది వదిలిపెట్టమన్నది. అంతేకాదు.

అలా వదిలి పెడితే కోరిన వరం ఇస్తానని కూడా చెప్పింది. అయితే, ఏం వరం కోరాలో తెలియక నేను అడక్కుండానే వచ్చేశాను,'' అన్నాడు ముసలాయన.



''వెర్రి మొహమా! ఇంట్లో తిన డానికి రొట్టె కూడా లేదు! అదైనా అడక్క పోయావా?'' అంటూ ముసలావిడ ఇల్లు ఎత్తుకు పోయేలా కేకలు పెట్టసాగింది.

ముసలాయన మౌనంగా పడవలో సముద్రంలోకి వెళ్ళాడు. ''చేపా! బంగారు చేపా! రా, నీళ్ళ మీదికిరా!'' అని పిలిచాడు. వెంటనే పైకి వచ్చిన చేప, ''ఏం కావాలో కోరుకో, ఇస్తాను,'' అన్నది.

''నా భార్య ఆకలితో అలమటిస్తోంది. రొట్టె కావాలంటోంది, ఇవ్వు,'' అన్నాడు ముసలాయన.

''అలాగే! నువ్వు ఇంటికి వెళ్ళు. కావలసినన్ని రొట్టెలు వస్తాయి,'' అని చెప్పి చేప వెళ్ళి పోయింది.

ఇంటికి తిరిగి వెళ్ళిన ముసలాయనకు, ''రొట్టెలు,రొట్టెలు,రొట్టెలు! ఆహా, ఎన్ని రకాల రొట్టెలు! జీవితాంతం సరిపోయే రొట్టెలు! ''అంటూ పట్టరాని ఆనందంతో పైకీ, కిందికీ గెంతుతూన్న భార్య కనిపించింది. అతడు బోసి నువ్వు నవ్వాడు.

మరి కొన్ని రోజులు గడిచాయి. ''నా స్నానంతొట్టె కారుతోంది. కొత్త స్నానం తొట్టె కావాలని బంగారు చేపను అడిగి రా,'' అన్నది ముసలావిడ.

అతడు సముద్రంలోకి వెళ్ళి చేపను పిలిచి స్నానం తొట్టె కావాలన్నాడు. బంగారు చేప ''అలాగే!''అన్నది.

అతడు ఇంటికి వచ్చి చూస్తే కొత్తతొట్టెలోని నీళ్ళలో పట్టరాని ఆనందంతో కేరింతలు కొడుతోంది అతడి భార్య.

మరో వారం తిరిగేసరికి, ''కొత్త తొట్టె పట్టేంత కూడా లేదు ఈ పాత కొంప. వెళ్ళి కొత్త ఇల్లు కావాలని బంగారు చేపను అడుగు,'' అని భర్తను పురమాయించింది ముసలావిడ. ఆమె చెప్పినట్టు ముసలాయన వెళ్ళి బంగారు చేపను అడిగాడు. ఇంటికి తిరిగివచ్చేసరికి తమ ఇల్లు ఉన్న చోట పెద్ద భవనం కనిపించింది. లోపల ఖరీదైనదుస్తులు, ఆభరణాలు ధరించి, ఉన్నత ఆసనంలో కూర్చున్న అతడి భార్య, ''ముసలాడా! నే నిప్పుడు జాలరి భార్యను కాను. ధనవంతురాలిని. ఆ చీపురుతో పెరడంతా శుభ్రం చెయ్,'' అని ఆజ్ఞాపించింది.

ముసలాయన మాట్లాడకుండా, అదే బోసి నవ్వు నవ్వి, చీవురు నందుకుని మెల్లగా ఈల వేసుకుంటూ ఊడ్వ సాగాడు.

ఆ దృశ్యం ముసలావిడకు నచ్చలేదు. ''ముసలాడా! నేను రాణిని కావాలి! ఈ క్షణమే ఆ చేప దగ్గరికి వెళ్ళి నన్ను రాణిని చెయ్యమని చెప్పు,'' అని ఆజ్ఞాపించింది.

మళ్ళీ ముసలాయన సముద్రానికి వెళ్ళి చేపకు భార్య కోరిక వినిపించాడు. చేప గాఢంగా ఊపిరి పీల్చి, ''సరి, అలాగే,'' అని చెప్పి వెళ్ళి పోయింది. అతడు ఇంటికి తిరిగి వస్తూ, భవనం ఎదుట యుద్ధ సైనికులు డ్రమ్ మోతలకు తగినట్టు లయ బద్ధంగా అడుగులు వేయడం చూశాడు. దానిని చూసి ముసలావిడకూడా, ''బింగ్! బాంగ్! బ్యాంగ్!'' అంటూ డ్రమ్మును మోగించ సాగింది.

ముసలాయన నవ్వు ఆపుకోలేక పకపకా విరగబడి నవ్వ సాగాడు. దానిని చూడడంతో ముసలావిడ మండిపోయి, ''ఆగు! ఏమిటా పొగరు? నాకు రాణిగా ఉండడం ఇష్టం లేదు. సముద్ర రాణి కావాలి! వెంటనే వెళ్ళి ఆ చేపను అడుగు,'' అని ఆజ్ఞాపించింది.

భార్య ఎప్పుడో హద్దులు దాటి ఎక్కడికో వెళుతున్నదని ముసలాయన గ్రహించాడు. అయినప్పటికీ అతడు సముద్రాన్ని సమీపించి చేపను పిలిచి, ''నా భార్య సముద్రపు రాణి కావాలంటోంది,'' అన్నాడు.

చేప మాట్లాడకుండా కనుమరుగైపోయింది. ఆ చేపను మళ్ళీ చూసే అవకాశం లేదని గ్రహించిన ముసలాయన ఇంటికేసి నడిచాడు.

సైనికులు లేరు. భవనం లేదు. పాత ఇంట్లో చిరిగిన బట్టలతో చేతిలో ఒకే ఒక రొట్టెతో కనిపించిన అతడి భార్య, ''అన్ని ఆడంబరాలు అనుభవిస్తూ సంతోషంగా ఉండలేం. ఇదే ఎంతో హాయిగా ఉంది ముసలాడా,'' అన్నది నెమ్మదిగా.

ముసలాయన చాలా సంతోషించాడు. మళ్ళీ అదే బోసి నవ్వు నవ్వాడు.



ఉదయ తారలు:

# వాణి సహానీ



- సతీష్‌సూరి, సతీష్ కుమార్ వాణి కోచెస్.
- ఆక్వాపాయింట్‌లోనూ, మంగోల్‌పురి (ఢిల్లీ) గవర్నమెంట్ స్విమ్మింగ్ పూల్‌లోనూ ఆమె శిక్షణ పొందుతున్నది.
- వాణి రోల్‌మోడల్ : ఒలింపియన్ స్టార్ మైఖేల్ ఫెల్ప్స్.
- వాణి ఇంతవరకు 200 పతకాలు, 22 ట్రోఫీలు గెలుపొందింది.
- ఆమెఅభిమాన టివి షో హన్నామొంటానా.
- హృతిక్ రోషన్ సినిమా లంటే ఇష్టం.

టైటిల్స్/మోడల్స్/ట్రోఫీలు

- సబ్‌జూనియర్ నేషనల్స్ (కొల్‌కత-2008) 2 పతకాలు.
- బాలికలు (12 ఏళ్ళలోపు) ఛాంపియన్‌షిప్ (వడోదర 2008)
- సబ్‌జూనియర్ నేషనల్స్ (గోవా 2007)- 5 పతకాలు.

పన్నెండేళ్ళ హుషారైన వాణి సహానీ రాష్ట్ర, జాతీయ స్థాయి స్విమ్మింగ్ టోర్నమెంట్లలో పాల్గొని విజయాలు కైవసం చేసుకున్నది.

అందుకు ఆమె చదువుతున్న స్కూల్ ఆమెకు మద్దతు నిస్తూ, ప్రోత్సహిస్తున్నది. ఆమె గెలుచుకున్న స్కాలర్‌షిప్పులు కూడా ఆమెకెంతో ఊతమిస్తున్నాయి. ఈమెకు ఫ్రీ స్టైయిల్ స్విమ్మింగ్ అంటే అన్నిటికన్నా ఇష్టం. చాలా ముమ్మరంగా ఈత ప్రాక్టీస్ చేస్తుంది. అయితే ఆహార విషయంలో పెద్దగా నియమాలు పాటించదు.

లెక్కలు వేయడం అన్నా, ఫ్రెంచి రాయడం, చదవడం, నేర్చుకోవడం అన్నా మహా ఇష్టం. మార్కులు ఎప్పుడూ ఎనభై శాతానికి పైనే.

ఆమెకు విమెన్స్ ఛాంపియన్‌షిప్, నేషనల్ స్కూల్ గేమ్స్ పెద్ద సవాళ్ళుగా నిలిచాయి. ఈ ఈవెంట్స్‌లో ఆమె తక్కిన వారితో పోల్చినప్పుడు కాస్త తక్కువ ప్రాయంలో కనిపించింది. అయినా అమితోత్సాహంతో పోటీ పడి ప్రశంసలు అందు కున్నది.

ఏ క్రీడ అయినా, సంతోషంగా శక్తినంతా ఉపయోగించి ఆడడమే ప్రధానం. ఫలితాలు తప్పకుండా సానుకూలంగానే ఉంటాయి అని ప్రగాఢంగా విశ్వసిస్తుంది వాణి. తన శక్తిసామర్థ్యా లను పెంపొందించుకుని నైపుణ్యాలకు మెరుగులు దిద్దుకుని మెరుగైన రికార్డు టైమింగ్స్ నిర్దేశించుకుని ఆరోగ్యకరమైన, ఉత్తేజకరమైన పోటీలలో పాల్గొనడమే ప్రస్తుతం ఆమె ఎదుట ఉన్న ప్రాధామ్యాలు.

మునుముందు మరెన్నో విజయాలు సాధించాలని ఈ నెల ఉదయ తారకు చందమామ శుభాకాంక్షలు తెలియ జేస్తు న్నది!



# యువ సంరక్షకులు

వంకర టింకరగా ఉన్న అడవి మార్గంలో తొమ్మి దేళ్ళ ప్రభు తనకున్న శక్తినంతా కూడదీసుకుని వేగంగా రొజుతూ రొప్పుతూ పరిగెడుతున్నాడు. ‘‘నీ కారణంగా గ్రామం గ్రామమంతా చిక్కుల్లో పడిపోయింది,’’ అన్న మంజునాథ్ మాటలు వాడి చెవుల్లో కఠినంగా ప్రతిధ్వనించ సాగాయి.

అది కర్ణాటకరాష్ట్రంలోని మారుమూల గ్రామం అడవిమల్లాపుర. గ్రామానికి రోడ్డు సౌకర్యం లేదు. విద్యుత్తు, టెలిఫోన్ వసతులు లేవు. చేరువలోని బస్‌స్టాప్‌కు చేరుకోవాలంటే ఎటు వెళ్ళినా కనీసం నాలుగు మైళ్ళు నడవాలి.

గ్రామంలోని ప్రజలందరూ పేదవాళ్ళే. వాళ్ళ కున్న సంపద అంతా గ్రామాన్ని ఆనుకుని ఉన్న అడవి ఒక్కటే. ఇన్ని కొరతలు, కష్టాలు ఉన్నప్ప టికీ తనుపుట్టిన అడవిమల్లాపుర అంటే ప్రభుకు అమిత అభిమానం. తమ గ్రామాభి వృద్ధిని గురించి ఆరోజు ప్రభు చదివే బడిలో జరుగనున్న సమా వేశంలో పెద్దలు చర్చించనున్నారు. అందులో తను కూడా కలుసుకోవాలనుకున్నాడు ప్రభు.




‘‘పెద్దలు మాట్లాడేది నీకేం అర్థమవుతుంది?’’ అని చెప్పి వెళ్ళిపోయింది వాడి తల్లి. ‘‘ఇది చాలా అన్యాయం!’’ అని అరిచాడు ప్రభు. చుట్టూ ఒక్కరూ లేరు గనక, వాడి కేక ఎవరికీ వినిపించలేదు. పక్కనే నిలబడ్డ మంజునాథ్ మాత్రం విన్నాడు. వాడు ప్రభు క్లాస్‌మేట్.

‘‘మన గ్రామాభివృద్ధికి పెద్దలు ఎలాంటి పథ కాలు రూపొందించనున్నారో తెలుసుకోవాలి. ఇది మన సొంత గ్రామం కదా?’’ అన్నాడు ప్రభు.

‘‘నిజమే ప్రభూ. అయినా, ఈ పెద్దలు చిన్న పిల్లలమని మన మాటలు అసలు పట్టించు కోరు. మరి మనకూ అక్కర ఉందని నిరూపించు కోవడం ఎలా?’’ అన్నాడు మంజునాథ్.

ప్రభు మరేదో చెప్పడానికి నోరు తెరవబోయి, ఎదుట కనిపించిన దృశ్యం చూసి అలాగే నిలబడి పోయాడు. నాలుగు ఎడ్ల బళ్ళనిండా కట్టెలు పక్క గ్రామానికి దొంగతనంగా తీసుకువెళుతున్నారు.

‘‘మన అడవి నుంచి కట్టెలు దొంగిలించు కుని వెళుతున్నారు. మన చెట్లను నరికేశారు!’’ అన్నాడు మంజునాథ్.

ప్రభు మండిపోయాడు. ‘‘ఇది దుర్మార్గం. వాళ్ళనెలాగైనా అడ్డుకోవాలి. ఆ పని మన ఇద్దరి వల్ల ఎలా అవుతుంది?’’ అని ఆవేశంతో ఆలో చిస్తూ చెప్పిన ప్రభు, ‘‘మంజూ, నువ్వు పరు గున వెళ్ళి మన పెద్దలను వెంటబెట్టుకుని రా, నేనిక్కడే ఉంటాను,’’ అన్నాడు.

మిత్రుడి కేసి ఒక్క క్షణం చూసిన మంజు నాథ్ గ్రామం కేసి పరుగుతీశాడు.

ప్రభు ఎడ్లబళ్ళ కేసి వెళ్ళి, ''చెట్లు నరకడం తప్పు. అడవిలోని చెట్లు మాకు చాలా ముఖ్యమైనవి. వాటిని మీరు తీసుకువెళ్ళనివ్వను. మిమ్మల్ని అరెస్టు చేయిస్తాను,'' అన్నాడు దృఢమైన కంఠస్వరంతో.

బళ్ళవాళ్ళు ఆ మాటలను పట్టించుకోకుండా హేళనగా నవ్వసాగారు. ప్రభు దారికి అడ్డంగా కూర్చుని, ''కట్టెలు తీసుకు వెళ్ళాలంటే, అది నా మీదుగానే సాధ్యం. బళ్ళను నా మీదికి తోలండి!'' అన్నాడు.

బళ్ళవాళ్ళకు ఏం చెయ్యాలో తెలియక బళ్ళను అలాగే ఆపారు. అంతలో అడవిమల్లాపుర గ్రామస్థులు ఆవేశంతో అక్కడికి చేరుకోవడంతో, ఆ తరవాత జరగవలసినవన్నీ చకచకా జరిగిపోయాయి.

బళ్ళు తోలేవాళ్ళను కిందికి లాగి చెట్లకు కట్టేశారు. కట్టెలను వశపరచుకున్నారు. పోలీసు వారిని పిలిచి నేరస్థులను అప్పగించారు. ఈ సంఘటనతో ప్రభు గ్రామంలో పెద్ద హీరో అయిపోయాడు. ఆ రోజు గ్రామం గ్రామమంతా సంబరపడిపోయింది... అయితే, ఆ సంతోషం ఎంతో కాలం నిలబడలేదు. ఎందుకంటే పక్క గ్రామస్థులు ధనవంతులు; పలుకుబడి కలిగిన వాళ్ళు. పోలీసు అధికారులను వాళ్ళవైపుకు తిప్పుకున్నారు. అసలు దొంగలను విడిపించుకోవడంతో పాటు, పగసాధించడానికి పూనుకున్నారు. అడవిమల్లాపుర గ్రామస్థులు అక్రమంగా అడవి నుంచి చెట్లు నరుకుతున్నారని పోలీసులకు దొంగ ఫిర్యాదులు చేశారు.

అడవి సమీపంలో తను నాటిన మొక్కలకు ప్రభు నీళ్ళు పోస్తూండగా మంజునాథ్ పరిగెత్తుకు వచ్చాడు. గ్రామానికి అటవీశాఖ అధికారులు వచ్చి, తాము దొంగల నుంచి వశపరచుకున్న కట్టెలను చూపి, అవి అక్రమంగా అడవి నుంచి తెచ్చుకున్నవని గ్రామస్థుల మీద నిందారోపణ చేస్తున్నారని చెప్పి, ''నీ కారణంగా గ్రామం గ్రామమంతా చిక్కుల్లో పడిపోయింది,'' అన్నాడు.

ప్రభు మరేం వినదలుచుకోలేదు. అకారణంగా గ్రామస్థుల నెలా శిక్షించగలరు? దొంగలను పట్టివ్వడం నేరమెలా అవుతుంది? అనుకుంటూ గ్రామం కేసి పరిగెత్తాడు.

అధికారులు ఇకపై చెట్లు నరికితే అరెస్టులు తప్పవని గ్రామస్థులను తీవ్రస్వరంతో హెచ్చరించి, అక్కడున్న కట్టెలను ట్రాక్టర్లకు ఎక్కిస్తున్నారు.

ఆ కట్టెలు పొరుగు గ్రామానికి చేరుతాయనీ, పోలీసు అధికారులు ఆ గ్రామస్థుల పక్షం వహిస్తున్నారనీ ప్రతి ఒక్కరికీ తెలుసు. అయినా దీనంగా తలలు వాల్చుకుని చూస్తూ ఉండిపోయారు. ప్రభు నిస్సహాయుడైపోయాడు. ఏం చేద్దామా అని ఆలోచించసాగాడు. వాడి దృష్టి పక్కనే గుంపుగా నిలబడ్డ స్త్రీల మీద పడింది. కట్టెలు నిండిన ట్రాక్టర్లను స్టార్ట్ చేస్తున్న అధికారుల కేసి వాడు వేగంగా నాలుగు అడుగులు

**చందమామ క్విజ్ - 12 (జనవరి '09) సమాధానాలు**

1. హైదరాబాదు సమీపంలోని షంషాబాద్‌లో 2. కోట్టయం సమీపంలోని కుడమలూర్‌లో 3. మొత్తం 77 పతకాలు; 33 బంగారు పతకాలు 4. ప్రకాష్ ఆప్టే - మందాకినీ ఆప్టే 5. అభినవ్ బింద్రా, షూటింగ్ 6. శామ్ మానేక్‌షా.

వేశాడు. ఆ తరవాత కన్నీళ్ళతో స్త్రీల కేసి చూశాడు. ఒక వృద్ధురాలు మెల్లగా వాణ్ణి సమీపించి, ''విచారించకు నాయనా,'' అన్నది.

మరుక్షణమే స్త్రీలందరూ పరస్పరం కూడబలుక్కున్న వారిలా వరసగా వచ్చి ట్రాక్టర్లకు అడ్డంగా నిలబడి, ''మా కట్టెలను తీసుకెళ్ళకండి,'' అన్నారు ముక్తకంఠంతో.

కొంతసేపటికి గ్రామస్థులందరూ వాళ్ళ వెనక చేరారు. ఈ అనూహ్య పరిణామానికి అధికారులు దిగ్భ్రాంతి చెందారు. బెదరగొట్టడానికి వచ్చిన వారు తామే ఒక్క నిమిషం హడలిపోయారు. కల్లా కపటం తెలియని ఆ గ్రామస్థుల ఐకమత్యం ముందు తమ పాచికపారదని గ్రహించారు. ఓటమిని అంగీకరించి అవమానంతో తిరిగివెళ్ళారు.

ఆ రోజు గ్రామస్థుల ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. ఆ సంఘటన ద్వారా వాళ్ళు సరికొత్త గుణపాఠం నేర్చుకున్నారు. పర్యావరణ పరిరక్షణలో ప్రతి బిడ్డకూ తగిన పాత్ర ఉందనీ, పిల్లలను ఆ విషయంలో ఉత్సాహ పరచాలనీ అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు.

తమ అడవిని పరిరక్షించే బాధ్యత తమ మీద ఉందని ప్రభు పిల్లలందరి చేతా ప్రమాణం చేయించాడు. ఆరోజు నుంచి పిల్లలు కూడా అడవిమల్లాపుర సభలలో పాల్గొనడం, మొక్కలు నాటడం, నీళ్ళు పోయడం, జట్టుగా అడవిని పరిరక్షించడం ప్రారంభించారు. ఇప్పుడు అడవిమల్లాపుర వెళ్ళే ప్రతి వారినీ, అక్కడి పిల్లలు తమ గ్రామం పట్ల, అడవి పట్ల చూపే అభిమానం ఆకట్టుకుంటోంది. వాళ్ళు అడవి 'యువసంరక్షకులు'గా ప్రశంసలు అందుకుంటున్నారు.





**Statement about Ownership of**

**CHANDAMAMA (Telugu)**

Rule 8 (FormVI), Newspaper (Central) Rules, 1956

1. **Place of Publication**
   2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
2. **Periodicity of Publication**
   MONTHLY
   1st of each calendar month
3. **Printer's Name**
   L. Subramanyan
   **Nationality**
   INDIAN
   **Address**
   2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
4. **Publisher's Name**
   L. Subramanyan
   **Nationality**
   INDIAN
   **Address**
   2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
5. **Editor's Name**
   L. SUBRAMANYAN
   **Nationality**
   INDIAN
   **Address**
   2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
6. Name and Address of individuals who own the newspaper
   **Chandamama India Ltd.**
   Board of Directors:
   1. Kiran Kulkarni
   2. Prashant Mulekar
   3. B. Viswanatha Reddi
   2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041

*I, **L Subramanyan**, do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

**(Sd.) L. SUBRAMANYAN**
1st March 2009 *Publisher*

యురేకా!

# ఉదజని అణుశకల శక్తి (పిహెచ్) సూచిక



కావలసిన వస్తువులు: ఫిల్టర్ పేపర్, బీట్‌రూట్, మినరల్ వాటర్, స్ట్రెయినర్, పెయింట్ బ్రష్.

తయారు చేయడం ఎలా:



- బీట్‌రూట్‌ను తురుముకుని పాత్రలో సగంవరకు నీళ్ళు నింపి, అందులోవేసి వేడి చేయండి. కనీసం 20 నిమిషాలు ఉడక బెట్టండి. 10 నిమిషాలు ఆరనివ్వండి.
- స్ట్రెయినర్‌తో బీట్‌రూట్ రసాన్ని వడగట్టి ఒక పళ్ళెంలోకి తీసుకోండి.
- పేపర్‌ను తీసుకుని బీట్‌రూట్ రసంలో ముంచెత్తండి.
- మీ పిహెచ్ పేపర్ రెడీ.
- మీరిప్పుడు రకరకాల ద్రవాలను పరీక్షించవచ్చు!
- మొదటిదిగా నిమ్మరసం, తాజాపాలు, పులిసినపాలు, వెనిగర్ టెస్ట్ చేయవచ్చు.



- క్లీన్ పాయింట్ బ్రష్ తీసుకుని, ద్రవంలో ముంచి పిహెచ్ పేపర్ మీద పెయింట్ చెయ్యవచ్చు. అల్కలైన్, ఆసిడిక్ (క్షారం/ఆమ్లం)అన్న దాన్ని బట్టి రంగుమార్పు ఉంటుంది.
- రకరకాల ద్రవాలతో మీకు కావలసిన అమ్ల-క్షార (యాసిడ్-అల్కలీ) పెయింటింగ్ తయారు చేసుకోవచ్చు.
- పిహెచ్ పేపర్‌కు బదులుగా, బీట్‌రూట్ జ్యూస్ తయారు చేసుకుని అందులో విభిన్న ద్రవాల చుక్కలు వేసి మార్పును గమనించవచ్చు.
- ద్రాక్ష రసం, పసుపు పొడి కలిపిన నీళ్ళు మొదలైన వాటితో ఇతర ఇండికేటర్ ద్రవాలు సృజనాత్మకంగా తయారు చేసుకోవచ్చు. మీ నాలుక పిహెచ్ ఎంతో తెలుసుకోవచ్చు.



కాన్సెప్ట్: పదార్థాల ఆల్కలైన్/అసిడిక్‌స్వభావాన్ని బట్టి రంగులు మార్చే పిహెచ్ (హైడ్రోజన్ అయాన్స్ ప్రెజెంట్) ఇండికేటర్ పిగ్మెంట్ ఆంథోసైయానిన్-బీట్‌రూట్‌లో ఉంది. బీట్‌రూట్‌పిహెచ్ ఇండికేటర్ ఉపయోగించి కనుగొనే విభిన్న రంగుల పిహెచ్ ఇంచుమించు ఇలా ఉంటుంది.

| పిహెచ్ | 2 | 4 | 6 | 8 | 10 | 12 |
|---|---|---|---|---|---|---|
| రంగు | ఎరుపు | లేతఎరుపు | ఊదా | నీలం | నీలం/పచ్చ | పచ్చ/పసుపుపచ్చ |

మన చరిత్ర పుటల నుంచి...

# ఒక వీరుడి మరణం

ఆరువందల సంవత్సరాలకు పూర్వం కోళిక్కోడు (కాలికట్) రాజధానిగా పశ్చిమ సముద్ర తీర ప్రాంతాన్ని పాలించిన జమోరిన్ రాజాకు నౌకాదళం ఉండేది. మరక్కార్లు ఆ దళానికి నాయకత్వం వహించేవారు. పశ్చిమ తీరాన్ని కాపలా కాసే మరక్కార్ల నౌకాదళాలకూ, పోర్చుగీసు నౌకలకూ తరచూ ఘర్షణలు జరుగుతూండేవి. మూడవ కున్హాలీ మరక్కార్‌గా పేరు గాంచిన పాత్తు కున్హాలీ దళనాయకుడుగా ఉన్నప్పుడు రాజా అనుమతి పొంది అరేబియా సముద్రంలో చలియం నది సంగమించే చోట ఒక కోటను నిర్మించుకుని అందులోనే నివసించసాగాడు.

ఆయన తరవాత నాలగవ కున్హాలీ మరక్కార్ నౌకాదళ నాయకుడయ్యాడు. తన పూర్వుల లాగే ఆయన జమోరిన్ నౌకాదళాన్ని మరింత పటిష్ఠం చేశాడు. అడ్మిరల్ కున్హాలీగా ప్రసిద్ధిగాంచాడు.

అప్పటి జమోరిన్ రాజా అసమర్థుడు. కపటులూ, అవినీతిపరులూ అయిన సంస్థానోద్యోగుల చెప్పుడు మాటలను సులభంగా నమ్మేవాడు. అలాంటి కపట వర్తనులలో ఒకడైన కారియక్కార్ తనస్వార్థ ప్రయోజనాలు నెరవేర్చుకోవడానికి ఆటంకంగా ఉన్న మరక్కార్ అడ్డు తొలగించుకోవాలనుకున్నాడు.

మరక్కార్‌పట్ల జమోరిన్‌కు ఎంతో విశ్వాసం ఉండేది. అలాంటి మరక్కార్ పోర్చుగీసువారికి అమ్ముడుపోయాడని కారియక్కార్ చెప్పడం విని దిగ్భ్రాంతి చెందాడు. ఆ విషయంగా మంత్రి మాగాత్తచ్చన్‌ను పిలిచి అడిగాడు. ఆయన అడ్మిరల్ కున్హాలీ నిజాయితీనీ, రాజభక్తినీ శంకించలేమని రాజాకు నచ్చ చెప్పాడు.

ఇలా ఉండగా ఒకనాడు రాజాగారి గజశాలలోని ఒక ఏనుగు తోక కోయబడి ఉన్నదని తెలియవచ్చింది. ఆ ఏనుగు అంతకు ముందు కున్హాలీ శిబిరంలోకి వెళ్ళి వచ్చిందని తెలియడంతో రాజా ఆగ్రహం చెందాడు.

కున్హాలీ, రాజాగారి ఏనుగుకు హాని తలపెట్టే సాహసం చేయగల అంతటి మూర్ఖుడు కాడని మంత్రి మాగాత్తచ్చన్ జమోరిన్‌కు ఎంతగానో చెప్పాడు. అయితే, జమోరిన్ ఆయన మాటలను వినిపించుకోలేదు. అడ్మిరల్ ఇకపై రాజభవనంలో అడుగు పెట్టకూడదని ఆజ్ఞ జారీచేశాడు.

**చందమామ క్విజ్ - 12 (జనవరి '09) విజేతలకు అభినందనలు**

1. జి.రంజిత్, తం.పే. జి. నరసింహారావు, లలితా కాలనీ, డాబా గార్డెన్స్, విశాఖపట్నం
2. ఎ. ఆర్. శౌర్యస్వి, మెహర్ నగర్, కాకినాడ - 533 003
3. టి. ప్రచోత్, తం. పే. పి. శ్రీనివాస్, కూకట్‌పల్లి పోస్ట్, హైదరాబాద్ - 500 092

మరునాడు జమోరిన్, మంత్రి మాగాత్తచ్చన్ ఏదో చర్చిస్తూండగా రాజ భవనం బయట గొడవ జరుగుతు న్నట్టు తెలియవచ్చింది. మంత్రి వెంటనే లేచి వెలుపలికి వెళ్ళి చూశాడు. అడ్మి రల్ ఉడుపుల్లో కున్హాలీ మరక్కార్ సభామంటపానికి వస్తూంటే కాపలా భటులు అడ్డుకుంటున్నారు. ఆయన పట్టించుకోకుండా ముందుకు నడుస్తు న్నాడు. అదీ గొడవకు కారణం. ''ఆగు! అడుగు ముందుకు వేయకు!'' అని అరిచాడు మంత్రి.



కున్హాలీ, ఆగి నాలుగడుగులు వెనక్కు వేశాడు. ఆ తరవాత, ''మిత్రమా, నిషేధం గురించి కారియక్కార్ నాకు చెప్పాడు. అయితే, నేను అది నమ్మలేదు. నేను పన్నెండు పోర్చు గీసు నౌకలను పట్టుకున్నాను. మరో ఆరింటిని నీట ముంచాను. రెండువందల సైనికులను హత మార్చాను. వారి దగ్గర దొరికిన సంపదను రాజు గారికి అప్పగించడానికే వస్తున్నాను. నన్ను రావద్దన డానికి నేను చేసిన నేరం ఏమిటి?'' అన్నాడు.

''రాజాగారి ఏనుగు తోకను నువ్వుకోయ లేదా?'' అని అడిగాడు మంత్రి.

''నన్ను గురించి బాగా ఎరిగిన నువ్వు, నేను ఏనుగు తోకను కోశానంటే అసలు నమ్ముతు న్నావా? నేను రాజాగారి ఏనుగును ముట్టుకో గలనా? అంతా పచ్చి అబద్ధం మిత్రమా,'' అన్నాడు అడ్మిరల్.

అంతలో జమోరిన్ మంత్రిని వెతుక్కుంటూ వెలుపలికి వచ్చాడు. ఆయన కున్హాలీ మీద అమిత్రాగ్రహంతో, ''రాజభవనంలో అడుగు పెట్టడానికి నీకెవరు అనుమతి ఇచ్చారు. నీ మొహం చూడ్డం నాకిష్టం లేదు,'' అని భటుల కేసి తిరిగి, ''వీణ్ణి, బంధించి చెరసాలలో వెయ్యండి,'' అన్నాడు.

కారియక్కార్ మరిద్దరు భటులు ఆయన్ను సమీపించారు. వెంటనే కత్తి దూసిన కున్హాలీ, ''ప్రాణాలపై ఆశలుంటే దగ్గరికి రాకండి,'' అని హెచ్చరించాడు. దాంతో వాళ్ళు అక్కడే ఆగి పోయారు. కున్హాలీ తలెత్తుకుని గంభీరంగా వెలుపలికి అడుగులు వేశాడు.

కొన్ని రోజులు గడిచాయి. పోర్చుగీసు నౌకలను కోట దరిదాపులకు రానీయకుండా తరిమికొడుతూ కోటను పరిరక్షించడంలో అన్నకు సాయపడు తూన్న కున్హాలీ తమ్ముడు కుట్టి ఒక దుర్వార్తను తీసుకొచ్చాడు. కోటను ముట్టడించడానికి జమోరిన్, పోర్చుగీసు వారితో చేతులు కలుపు తున్నాడన్నదే అది. విదేశీయులకు లొంగి పోకూడ దని కున్హాలీ నిర్ణయించి యుద్ధసన్నద్ధుడయ్యాడు.

కొత్త పోర్చుగీసు వైస్రాయికి స్వాగతం పలక డానికి రాజభవనం సమాయత్తం కాసాగింది.



అతడి రాకను తెలుపుతూ తుపాకీలు పేలాయి. సరిగ్గా ఆసమయానికి మాగాత్తచ్చన్ అక్కడికి వచ్చాడు. తన మంత్రిని అప్పుడక్కడ చూడడం ఇష్టం లేని జమోరిన్, ''నిన్ను నేను ఇక్కడికి రమ్మన లేదే!'' అన్నాడు కోపంగా. ''ఇన్నాళ్ళుగా మరక్కార్లు రాజ్యాన్ని శత్రువులనుంచి పరిరక్షించారు. పోర్చుగీసు సముద్ర దొంగలను తరిమి తరిమి కొట్టి కోళిక్కోడు ప్రతిష్ఠను నిలబెట్టారు. కున్హాలీ వంటి గొప్ప దేశభక్తుణ్ణి తమరు బద్ధశత్రువులాగా పరిగణిస్తున్నారు. ప్రస్తుతం మీ అసలు శత్రువుకు స్నేహహస్తం అందిస్తున్నారు. ఇలాంటి దురన్యాయాన్ని చూస్తూ నేను సాక్షిగా నిలబడలేను. మీరు ఇచ్చిన అధికార ఖడ్గాన్ని మీకు అప్పగిస్తున్నాను. స్వీకరించండి!'' అని ఖడ్గాన్ని జమోరిన్ పాదాల వద్ద ఉంచి వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

కోట కోసం యుద్ధం ఆరంభమయింది. జమోరిన్ సైన్యంలోని, నాయర్ వీరులు తాము ఇప్పుడు పోర్చుగీసుల పక్షం వహించి పోరాడుతున్నట్టు గ్రహించారు. కున్హాలీ దళనాయకుడు కుంగోన్ ఆయుధాగారానికి నిప్పు పెట్టి శత్రువుల ఓడను పట్టుకున్నాడు.

పోర్చుగీసులు వైస్రాయ్ మతాయిస్ డీ అల్బుక్వెర్క్‌ను ఉన్నపళాన వెనక్కు రమ్మన్నారు. అతడి స్థానంలో వాస్కోడాగామా మనవడు ఫ్రాన్సిస్కో డా గామా నియమించబడ్డాడు. అతడు కున్హాలీ కోట అంతిమ దాడికి పెద్ద సైనిక బలాన్ని సమకూర్చుకున్నాడు. కోటను చుట్టుముట్టడానికి పన్నెండు ఓడలను పంపాడు. అడ్డు వలయాన్ని అధిగమించి కోట పరిరక్షణకు కావలసిన ఓడలను రప్పించే అవకాశం సన్నగిల్లింది. అయితే, ఆ సమయంలో కూడా దళపతి కుట్టి అమూ ఒక ఓడను పట్టుకుని పోర్చుగీసు ముట్టడిని ఛేదించాడు.

ఆఖరికి తను లొంగి పోవడానికి సిద్ధంగా ఉన్నట్టు కున్హాలీ జమోరిన్‌కు విశ్వాస పాత్రుడైన మెప్పాయిల్ కురూప్ ద్వారా కబురు పంపాడు. జమోరిన్ అందుకు అంగీకరించి కున్హాలీని గౌరవంగా నడపాలని పోర్చుగీసులను కోరాడు.

కూన్హాలీ మరక్కార్ గంభీరంగా నడిచి వచ్చి జమోరిన్ పాదాల ముందు ఖడ్గం ఉంచి వినయంగా నమస్కరించాడు. పక్కనే ఉన్న పోర్చుగీసు కమాండర్ యాండ్రి ఫర్టాడో వెంటనే అతడి రెక్కపట్టి పక్కకు లాక్కుపోయాడు. పోర్చుగీసు భటులు అతణ్ణి నాటి వైస్రాయ్ స్థావరమైన గోవాకు ఓడలో తరలించారు.

రెండు రోజుల తరవాత ఎలాంటి విచారణ జరపకుండానే అడ్మిరల్ కున్హాలీ మరక్కార్‌ను ఉరితీశారు.

# వార్తలలో బాలలు

## బొమ్మలతో విరాళం



బొమ్మలు వేయడం అంటే పిల్లలకు మహా ఇష్టం. అవునా? చెన్నయ్‌కి చెందిన గాయత్రి నీలకంఠన్ చిత్రలేఖనాన్ని కాస్త శ్రద్ధతోనే అలవరచుకుని చక్కగా బొమ్మలు గీయడం నేర్చుకున్నది. అంతేకాదు. తను గీసిన చిత్రాలను అమ్మి ఆ డబ్బును ఒక చారిటీకి ఇస్తున్నది.

మూడేళ్ళ క్రితం తమిళనాడు కిడ్నీ రిసెర్చ్ ఫౌండేషన్ ఏర్పాటు చేసిన ఒక కార్యక్రమానికి తన బొమ్మలను విక్రయించి ఆ సొమ్మును విరాళంగా ఇవ్వమని గాయత్రి అత్తయ్య సలహా ఇవ్వడంతో ఇది ఆరంభమయింది. ఇప్పటివరకు 10,000 రూపాయలకు పైగా వసూలు చేసి ఇచ్చింది.

''మనం సకల వసతులతో హాయిగా బతుకుతున్నాం. అయితే, కొందరికి తినడానికి తిండి కూడా దొరకడం లేదు. అలాంటి వారికి మన చేతనైన సాయం అందించాలి,'' అంటుంది గాయత్రి.

## చిన్నారి ప్రశ్న

ప్రశ్నలడగడం పిల్లల నైజం. ఇలా ప్రశ్నించడం వల్ల తన తల్లికే కాకుండా తమ గ్రామస్థులందరి బతుకులనూ కాస్త సులువుగా మార్చింది ఒక అమ్మాయి!

ఉత్తరాంచల్‌లోని ఒక మారుమూల గ్రామం. ఆ గ్రామానికి చెందిన సీమా అనే అమ్మాయి తన తల్లి కోసం ఊరికొలనుకు వెళ్ళి నీళ్ళు తెచ్చేది. ఒక నాడామె తల్లిని, ''అవునూ, మన గ్రామంలోని కొళాయి పైపును ఇంకా ఎందుకు రిపేరు చేయలేదు?'' అని అడిగింది.



''అది నాకు తెలియదు. వెళ్ళి గ్రామసర్పంచిని అడుగు,'' అన్నది తల్లి యథాలాపంగా. అంతే, సీమా నిజంగానే గ్రామసర్పంచి వద్దకు వెళ్ళి అదే ప్రశ్న అడిగింది. దాంతో సర్పంచి కళ్ళు తెరిచి గ్రామ పెద్దలతో కలిసి గ్రామంలోని కొళాయి పైపును రిపేరు చేయమని జిల్లా అధికారులకు అర్జీ పంపాడు. అధికారులు సానుకూలంగా స్పందించడంతో నిధులు వచ్చాయి. పైపు రిపేరు పూర్తయింది. ఒక చిన్నారి అడిగిన ప్రశ్న గ్రామస్థుల తాగునీటి సమస్యను పరిష్కరించింది.



# జాలరి రాజు

ఉజ్జయిని రాజ్యంలో గంగపుత్రుడు అనే జాలరి యువకుడు ఉండేవాడు. వాడికి తల్లి తప్ప నా అనే వాళ్ళెవరూ లేరు. వాడు తల్లిని కంటికి రెప్పలా కాపాడుతూ, ఉన్నంతలో తృప్తిగా జీవిస్తూ, ఎదుటి వారికి చేతనైన సాయం చేస్తూ కాలంగడపసాగాడు.

ఒకనాడు గంగపుత్రుడు చేపల వేటకోసం పడవలో సముద్రం మధ్యకు చేరుకుని వల విసిరాడు. అంతలో సముద్రం అల్లకల్లోలమయింది. ఉవ్వెత్తున అలలు లేచి వాడి పడవను తల్లకిందులు చేశాయి. నీళ్ళలోకి విసిరివేయబడ్డ గంగపుత్రుడు ప్రాణాలు కాపాడుకోవడం కోసం ప్రయత్నించసాగాడు. మెల్లగా సముద్రం శాంతించింది. దూరంలో మునిగిపోయిన ఒక నౌక కనిపించడంతో వాడు ఈదుకుంటూ వెళ్ళి అంతగాలోతు లేని నీళ్ళల్లో ఉన్న ఆ నౌకను చేరుకున్నాడు.

అది చాలా పురాతనమైన నౌక. నౌకలో మృతుల అస్థిపంజరాలు కొన్ని కనిపించాయి. ఒక మూలగా పెద్ద పెద్ద చెక్క పెట్టెలు కనిపించాయి. వాటిని తెరిచి చూడగా మణులు, మాణిక్యాలు, బంగారు నాణాలు బయట పడ్డాయి. అంత సంపద మహారాజు ఖజానాలో సైతం ఉంటుందా అన్న అబ్బురపాటుకు లోనైన గంగపుత్రుడు కొన్ని బంగారు నాణాలు తీసి మూట కట్టుకుని నడుముకు చుట్టుకున్నాడు. నౌక ఉన్న ప్రాంతాన్ని జాగ్రత్తగా గుర్తుపెట్టుకున్నాడు. తరవాత అలల మీద తేలుతూ కనిపించిన ఒక తెప్ప సాయంతో ఒడ్డుకు చేరుకున్నాడు.

గంగపుత్రుడు తెచ్చుకున్న బంగారు నాణాలతో కొంత కాలం సుఖంగా గడిచిపోయింది. వాడికి తరచూ నౌకలోని సంపద గుర్తుకు వస్తూండేది.

[illegible]

మరి కొన్నాళ్ళకు తెచ్చుకున్న బంగారు నాణాలు అయిపోవడంతో వాడు మళ్ళీ నౌక నుంచి మరి కొన్ని నాణాలు తెచ్చుకోవాలనుకున్నాడు. రెండు మూడు రోజులకు సరిపడా ఆహారపదార్థాలు సిద్ధంచేసుకుని పడవలో సముద్రంలోకి బయలుదేరాడు. చాలా సేపు పయనించి నౌక మునిగి ఉన్న ప్రాంతాన్ని చేరుకున్నాడు. పడవకు లంగరు వేసి నీళ్ళలోకి దూకాడు.

నౌకలోకి చేరిన గంగపుత్రుడు కొన్ని బంగారు నాణాలు తీసుకుని బయలుదేరబోతూండగా, ''మిత్రమా నాకోసాయం చేయగలవా?'' అన్న కంఠస్వరం వినిపించింది. ఉలిక్కిపడిన గంగపుత్రుడు వెనక్కు తిరిగి చూశాడు. ఒక అస్థిపంజరం కదులుతూ కనిపించింది.

''అవును మిత్రమా! మాట్లాడుతున్నది నేనే. నేను మునిగిపోయిన ఈ ఓడ సరంగును. నా వాళ్ళు దరిద్రంతో అష్టకష్టాలు పడుతున్నారు. వాళ్ళను వదిలి పంచభూతాలలో కలిసిపోలేక ఇలా నౌకలోనే ఉంటున్నాను. నువ్వు ఇక్కడి సంపదలోని కొంత భాగాన్ని వాళ్ళకు అందజేశావంటే నేను ప్రశాంతంగా వెళ్ళిపోతాను,'' అన్నది.

''నీ కోరిక తప్పక నెరవేరుస్తాను,'' అని చెప్పిన గంగపుత్రుడు మరికొన్ని బంగారు నాణాలు తీసుకుని, అతడి వారసుల వివరాలు అడిగి తెలుసుకుని అక్కడి నుంచి తిరుగుప్రయాణమయ్యాడు. ఆ తరవాత చనిపోయిన ఓడసరంగు వారసుల వివరాలు



ఆరా తీశాడు. వాళ్ళు పుట్టెడు దరిద్రంతో కష్టాలు అనుభవిస్తున్నారు. తాను ఎవరైనదీ బయటపెట్టకుండా, రహస్యంగా వారికా బంగారు నాణాలు అందజేశాడు. మరి కొన్నాళ్ళ తరవాత వెళ్ళి చూస్తే వాళ్ళందరూ సంతోషంగా కనిపించారు.

అప్పుడు గంగపుత్రుడికి ఒకసత్యం స్ఫురించింది. రాజ్యంలో చాలామంది పేదరికంతో మగ్గుతున్నారు. వాళ్ళందరికీసాయం చేయాలనిపించింది. పడవలో సముద్రంలోకి వెళ్ళి నౌక నుంచి పెద్ద మొత్తంలో బంగారం తెచ్చి పేదసాదలకు రహస్యంగా అందజేశాడు. దాంతో వాళ్ళ దరిద్రం తీరింది.

ఇలా ఉండగా రాజ్యంలోని కొందరు ఉన్నట్టుండి స్థితిమంతులై పోతున్నారనీ, దానికి కారణం తెలియడం లేదనీ వేగులు రాజు



వేళాంగుడికి సమాచారం అందించారు. అది రాజుకు అమితాశ్చర్యం కలిగించింది. అలాంటి వారికి ఎవరో రహస్యంగా సహాయం చేస్తూంటారనీ, అలా చేస్తున్న వాడెవరో కనుగొనమనీ రాజు మంత్రిని ఆదేశించాడు.

మంత్రి ఈ విషయం కనుగొనడానికి మరి కొంత మందిని నియమించాడు. ఆ పని గంగపుత్రుడు చేస్తున్నాడన్న సంగతి పక్షం రోజుల్లో బయటపడింది. ఒక జాలరి ఎక్కడి నుంచి అంతబంగారం తెస్తున్నాడు? తెచ్చిన బంగారాన్ని తను ఉంచుకోకుండా పేదలకు ఎందుకు పంచిపెడుతున్నాడు? ఇందులో ఆంతర్యం ఏదో ఉందని భావించిన రాజు గంగపుత్రుణ్ణి పిలిపించి వివరణ అడిగాడు.

గంగపుత్రుడు, "మహారాజా, కొన్నాళ్ళ క్రితం చేపలు పట్టడానికి వెళ్ళిన నేను ప్రమాద వశాత్తు నడి సముద్రంలో మునిగి పోయిన ప్పుడు, సముద్ర జలాలలో ఎప్పుడో మునిగి పోయిన నౌకను చూశాను. అందులో బంగారు నాణాలు ఉండడం గమనించి కొంత తెచ్చు కుని సొంతానికి వాడుకున్నాను. ఆ తరవాత నౌకలోని ఒక ప్రేతాత్మ కోరిక మేరకు పేదరికంతో అలమటిస్తున్న అతడి బంధువులకు కొంత బంగారం తెచ్చి ఇచ్చాను. వాళ్ళు దరిద్రం నుంచి బయటపడి సుఖజీవనం సాగించడం నాకెంతో తృప్తినీ, ఆనందాన్నీ కలిగించింది. అందువల్ల నిరుపేదలకు బంగారం తెచ్చి ఇవ్వడం మొదలు పెట్టాను," అన్నాడు.

ఆ మాట వినగానే సభలోని మంత్రి భుజంగరాయుడు లేచి నిలబడి ఆవేశంతో ఊగిపోతూ, "ఈ జాలరి సముద్రంలో కనిపిం చిన సంపదను మహారాజుకు తెలియ పరచ కుండా సొంతానికి వాడుకున్నాడు. అంతటితో ఆగకుండా రాజుగారి అనుమతి లేకుండా దానిని తనకు ఇష్టమైనవారికి అందించి, తాను రాజుకన్నా గొప్పవాడని చూపుకోవడానికి ప్రయత్నించాడు. ఇది అంతకన్నా ఘోరం!" అన్నాడు.

మంత్రి ప్రజల సమస్యలను రాజుగారి దృష్టికి రానీయకుండా అడ్డుపడుతూ, తను మాత్రం విలాసజీవితం గడుపుతూన్న స్వార్థ పరుడు.

అతడి మాటలు విన్న రాజు గంగపుత్రుడి కేసి చూస్తూ, "నౌకలోని సంపద గురించి నాకెందుకు తెలియజేయలేదు?" అని అడిగాడు.

''నౌకలోని సంపదల గురించి మొదట తమకు తెలియపరచాలనే అనుకున్నాను. అయితే, ఖజానాలో సంపదలు మూల్గుతున్న మన రాజ్యంలోనే కొందరు కటిక దరిద్రం అనుభవిస్తున్నారు. అంటే, తమదృష్టి వాళ్ళ మీద సారించలేదనే కదా అర్థం? ఇప్పుడు కొత్తగా సంపదలు వచ్చినా అవి పేదలకు అందగలవన్న నమ్మకం లేకే, ఆ సహాయం ఏదో నేనే రహస్యంగా చేయడానికి పూనుకున్నాను. అది అపరాధమని భావిస్తే ప్రభువులు క్షమించాలి,'' అన్నాడు గంగపుత్రుడు వినయంగా.

వాడి మాటలు విన్న రాజు కొంతసేపు మౌనంగా ఆలోచించాడు. ఆ తరవాత తలపంకించి, ''గంగపుత్రా! అంతులేని సంపదలు చూసి కూడా ఆశకు పోకుండా నిరుపేదలకు సాయం చేసిన నీ పరోపకార బుద్ధి శ్లాఘనీయం. అంతే కాదు. నీ చర్యతో నా కళ్ళు తెరిపించావు. నేను ప్రజల గురించి అంతగా పట్టించుకోకపోవడానికి ప్రధాన కారణం నా వృద్ధాప్యం. నా వయోభారాన్ని అడ్డంగా పెట్టుకుని మంత్రి వంటివారు చేస్తున్న అవాంఛనీయ కృత్యాలు నేను ఎరగనిది కాదు. సంతానం లేని నేను తగిన వారసుడి కోసం అన్వేషిస్తున్నాను. విద్యాగంధం లేకపోయినా ప్రజల క్షేమమే పరమావధిగా భావించే నిన్ను మించిన వారసుడు మరొకడు ఉండడు. నా కోరిక మన్నించి రాజ్యభారం స్వీకరించు. రాజగురువూ, నేనూ నీకు తగిన సలహాలిస్తాము. ఈ క్షణమే భుజంగయుక్తి మంత్రి పదవినుంచి తొలగిస్తున్నాను,'' అన్నాడు.

రాజు మాటలకు సభికులు హర్షధ్వానాలు చేశారు.

ఆ తరవాత గంగపుత్రుడి నాయకత్వంలో, నౌకలోని సంపదలు రాజధానికి తరలించబడ్డాయి. నదులకు ఆనకట్టలు కట్టి, కాలువలు తవ్వించి నీరు మళ్ళించడంతో ఉజ్జయిని సస్యశ్యామల మయింది. అనతి కాలంలోనే పేదరికం నిర్మూలించబడింది. ఒక శుభ ముహూర్తాన గంగపుత్రుడికి రాజ్యపట్టాభిషేకం జరిగింది. అతడు జాలరి రాజుగా పేరుగడించాడు.





# బంగారు నెమలి

బోధిసత్త్వుడు ఒకప్పుడు, బ్రహ్మదత్తుడి కాశీ రాజ్యంలో ఒక నెమలిగా జన్మించాడు. అది మామూలు అన్ని నెమళ్ళ వంటిది కాదు. అపురూపమైన బంగారు నెమలి! అది దండ కారణ్యంలో విహరిస్తూ ఉండేది.

ఒకనాడు కాశీరాజు భార్య పట్టమహిషికి ఆ బంగారు నెమలి కలలో కనబడగా, అది కావాలని ఆమె భర్తతో చెప్పింది. రాజు మంత్రులను అడిగాడు. వారు బ్రాహ్మలకు తెలుస్తుందన్నారు. బ్రాహ్మల నడగితే వారు వేటగాళ్ళకు తెలుస్తుందని చెప్పారు.

రాజు దండకారణ్యానికి సమీపంలో వుండే ఒక వేటగాణ్ణి రప్పించి, ''ఫలాని బంగారు నెమలిని జీవాలతో తీసుకువస్తే గొప్ప బహుమానం ఇస్తాను,'' అని చెప్పాడు. వేటగాడు అంగీకరించి వరుసగా ఏడేళ్ళు మాటు వేశాడు. కానీ, నెమలి వలలో పడలేదు. వేటగాడు చనిపోయాడు. నెమలిని కోరిన ఆ మహారాణి కూడా చచ్చిపోయింది.

''కలలో కనబడిన ఒక నెమలి కోసం బెంగ పట్టుకుని, నా రాణి మరణించటమా!'' అని రాజుకు కోపం వచ్చింది. అప్పుడాయన, ''దండకారణ్యంలో బంగారు నెమలి సంచరిస్తూ వుంది. దాని మాంసం తిన్న వాళ్ళకు జరామరణాలు ఉండవు,'' అంటూ ఒక ప్రకటన కోటగుమ్మం ముందు వేలాడగట్టించాడు.

ఆ రాజు తదనంతరం యువరాజు మళ్ళీ ఇంకో వేటగాడిని బంగారు నెమలి కోసం పంపించాడు. లాభం లేకపోయింది. ఇలా ఆరు తరాలు గడచిపోయినై.

ఏడవసారి గద్దె ఎక్కిన రాజు కూడా ఆ ప్రకటన చూసి, వేటగాడిని పంపాడు. వేట

జాతక కథ

గాడు యుక్తిగా ఆ నెమలిని పట్టివేసి కాశీ రాజుకు అప్పగించాడు.

ఆ బంగారు నెమలిని చూడగానే రాజుకు ఆశ్చర్యం కలిగి, గౌరవభావం ఏర్పడింది. దాని కోసం ఎత్తయిన ఒక సింహాసనం తన పక్కన వేయించాడు.

అప్పుడు నెమలి రూపంలో ఉన్న బోధిసత్వుడు, ''రాజా! నన్నెందుకు పట్టించి ఇక్కడికి తెప్పించావు?'' అని అడిగాడు.

''నీ మాంసం తింటే జరామరణాలు ఉండవని చెబుతున్నారు,'' అన్నాడు రాజు.

''అంటే, నన్ను చంపవలసిందేకదా?'' అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

''అవును,'' అన్నాడు రాజు.

''పిచ్చివాడా! నాకే మరణం నిజమైతే నా మాంసం తిన్నవాళ్ళకు మరణం లేకపోవడం ఏమిటి?'' అని మళ్ళీ ప్రశ్నించాడు బోధిసత్వుడు.

''నీది అపురూపమైన బంగారు చాయ. కనుక, నీ మాంసం తిన్నవాళ్ళకు ఆ చాయ వస్తుందనీ, వాళ్ళకు చావు ఉండదనీ మా తండ్రి చెప్పాడు,'' అన్నాడు.

''అయితే రాజా! నాకీ బంగారు చాయ వచ్చిన కారణం చెబుతా విను: ఒకప్పుడు నేనీ రాజ్యానికే మహారాజుగా ఉండేవాడిని . నేను న్యాయంగా పాలించి ధర్మం నిలబెట్టినందుకు ఫలితంగా ఈ జన్మలో బంగారు నెమలిగా పుట్టాను,'' అని చెప్పాడు బోధిసత్వుడు.

కాశీ రాజు విస్తుపోయి, ''ఏమిటీ, ధర్మ పరిపాలనకు ఫలితమా ఇది! నీ మాటకు రుజువేమిటి?'' అని అడిగాడు.

''లేకేమి? నేను మహారాజుగా ఉన్న కాలంలో ఒక నవరత్న ఖచితమైన దివ్యరథం మీద విహారం చేసేవాణ్ణి. అది ఉద్యానవనంలో కొలను పక్కన పూడ్చబడి ఉన్నది,'' అన్నాడు బోధిసత్వుడు.

కాశీరాజు ఆ ప్రకారం కొలనుపక్కన తవ్వించగా దివ్యరథం కనిపించింది!

ఆనాటి నుంచి రాజు బోధిసత్వుణ్ణి తన గురువుగా ఎంచుకున్నాడు.



## యేడాది చివరి అవార్డులు




### అథ్లెటిక్స్

జమైకాకు చెందిన యుసేన్ బోల్ట్, రష్యాకు చెందిన ఎలీనా ఐసిన్‌బయేవా 2008 వరల్డ్ అథ్లెట్ అవార్డును గెలుచుకున్నారు. జమైకా టీమ్ సరికొత్త ప్రపంచ రికార్డు నెలకొల్పిన 4x100 మీ. రిలేలో మూడవ బంగారు పతకం సాధించడంతో పాటు జమైకా స్ప్రింటర్ 100, 200 మీ.లలో బీజింగ్ ఒలింపిక్స్‌లో ప్రపంచ రికార్డు సాధించాడు. ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ అథ్లెటిక్స్ ఫెడరేషన్ ప్రెసిడెంట్ ల్యామిన్ డియాక్ 100,000 డా. అవార్డు ప్రకటిస్తూ, "అద్భుతమైన ప్రతిభ," అని కొనియాడాడు.

2004 ఒలింపిక్స్‌లో బంగారు పతకం సాధించిన రష్యన్ పోల్ వాల్టర్ 2008 బీజింగ్ క్రీడలలోనూ విమన్స్ పోల్ వాల్ట్ టైటిల్ దక్కించుకున్నది. ఆమె 5.05 మీ. జంప్ 24వ ప్రపంచ రికార్డు.

### ఫుట్‌బాల్




మాంచెస్టర్ యునైటెడ్‌కు ఆడే పోర్చుగల్‌కు చెందిన క్రిస్టియానో రొనాల్డో 2008 ఎఫ్ఐఎఫ్ఎ వరల్డ్ ఫుట్‌బాలర్‌గా ఎంపికయ్యాడు. 2007 టైటిల్ గెలుచుకున్న బ్రెజిల్‌కు చెందిన కకా 183 పాయింట్లను అధిగమించి 935 పాయింట్లు స్కోర్ చేశాడు. అర్జెంటీనాకు చెందిన లియోనల్ మెస్సీ 678 పాయింట్లు స్కోర్ చేసి రొనాల్డోకు తరవాత నిలిచాడు.

బ్రెజిల్‌కు చెందిన మార్టా ఎఫ్ఐఎఫ్ఎ వరల్డ్ ఫుట్‌బాలర్ 2008గా ప్రకటించ బడింది. ఆమె 1,002 పాయింట్లు స్కోర్ చేసింది. ఆమె వరసగా మూడోసారి ఈ అవార్డును అందుకుంటోంది.



# రామాయణం

విభీషణుడు రాజ్యకాంక్షతో వచ్చాడని హనుమంతుడన్న మీదట రాముడు తన అభిప్రాయాన్ని కూడా బయటపెట్టుతూ, ''ఈ విభీషణుడెంత దుర్మార్గుడు కానీయండి, శరణని వచ్చిన తరవాత నేను అతణ్ణి విడవలేను. అది సజ్జనుల పద్ధతి కాదు,'' అన్నాడు.

దానికి సుగ్రీవుడు ఒప్పుకోక, ''ఇతను మంచి వాడే అయితే మాత్రం ఇతని వల్ల మనకేమిటి లాభం? ఇతణ్ణి చేర నివ్వగూడదు. అన్నను వదిలి వచ్చిన క్షుద్రుడు మనను నమ్ముకుని ఉంటాడని ఏమిటి?'' అన్నాడు.

''రాజులలో ఒక ధర్మం ఉన్నది. జ్ఞాతులు కూడా ఇరుగుపొరుగు రాజుల వంటి వారే; కష్టకాలంలో దెబ్బ తీస్తారు. అందుచేత యోగ్యులైన రాజులు కూడా బలవంతులైన జ్ఞాతులను నమ్మరు. ఇతణ్ణి రావణుడు నమ్మలేకపోయాడు. అందుచేత విభీషణుడు మన వద్దకు వచ్చాడు. మనం రాక్షసులం కాము; మనకు రాక్షస రాజ్యం పైన కాంక్ష లేదు. అందుచేత మన ద్వారా ఇతను రాజ్యం పొందగోరుతున్నాడు. ఇతను మనని విడవడు,'' అన్నాడు రాముడు.

అయినా సుగ్రీవుడు ఊరుకోక, ''రావణుడే ఇతణ్ణి ఇక్కడికి రహస్యంగా పంపాడు, సందేహం లేదు. నిన్నో, నన్నో, లక్ష్మణుణ్ణో కడతేర్చటానికే ఇతను వచ్చాడు. అందరమూ కూడా చావ వచ్చు. దుర్మార్గుడైన రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటం?'' అన్నాడు.

''ఇతను దుర్మార్గుడైతే మాత్రం నన్నేం చేయగలడు. ఇతను మారు వేషంలో వచ్చిన

యుద్ధకాండ – 3



రావణుడే అయినా శరణన్న తరవాత విడిచి పుచ్చను. శరణార్థిని రక్షించటానికి ప్రాణాలైనా ఇవ్వాలి. నువ్వు వెంటనే అతణ్ణి తీసుకురా!'' అని రాముడు సుగ్రీవుడితో అన్నాడు.

ఈ మాటలతో సుగ్రీవుడి మనసు మారింది. అతను వెళ్ళి విభీషణుణ్ణి రాముడి వద్దకు తీసుకు వచ్చాడు. విభీషణుడు తన నలుగురు అనుచరులతో బాటు రాముడి కాళ్ళపై పడి, 'నేను రావణుడి తమ్ముణ్ణి. అతడి వల్ల అవమానం పొంది నిన్ను శరణు జొచ్చాను. నా సర్వస్వాన్నీ లంకలో వదిలి ఇక్కడికి వచ్చాను. ఇక నా జీవితమూ, నా సౌఖ్యమూ, నా రాజ్యమూ నీ చేతిలో ఉన్నాయి,'' అన్నాడు.

రాముడు విభీషణుణ్ణి ఆశ్వాసించి, ''రాక్షసుల బలాబలాలను యథార్థంగా వివరించి చెప్పు,'' అన్నాడు.

దానికి విభీషణుడిలా చెప్పాడు: ''గంధర్వ ఉరగ రాక్షసుల చేతనూ, ఏ భూతం చేతనూ చావు లేకుండా రావణుడు బ్రహ్మ నుంచి వరం పొందాడు. రావణుడికి తమ్ముడూ, నాకు అన్నా అయిన కుంభకర్ణుడు మహా బలశాలి, యుద్ధంలో ఇంద్రుడికి సమానుడు. రావణుడి సేనాపతి అయిన ప్రహస్తుడు కుబేర సేనాపతి అయిన మణిభద్రుణ్ణి జయించిన వాడు. హనుమంతుడతణ్ణి గురించి చెప్పే ఉంటాడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు వర ప్రసాదుడు; యుద్ధం చేస్తూనే అదృశ్యుడైపోయి శత్రువులను చంపగల వాడు. మహోదరుడూ, మహాపార్శ్వుడూ, అకంపనుడూ అనే రావణ సేనాపతులు దిక్పాలకులతో సమంగా యుద్ధం చెయ్యగల వారు. రక్తమాంసాహారులూ, కామరూపులూ అయిన రాక్షసులు లంకలో పదివేల కోట్ల మంది ఉన్నారు. వారి సహాయంతోనే రావణుడు దిక్పాలకులను జయించాడు.''

విభీషణుడు చెప్పిన ఈ మాటలు విని రాముడు, ''విభీషణా, ఈ పనులన్నీ చేసిన రావణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, రావణుడి బలగాన్నీ చంపి, లంకారాజ్యం నీకు చేకూర్చుతాను, నా మాట నమ్ము. అతను రసాతలానికి పోనీ, పాతాళానికి పోనీ, బ్రహ్మలోకానికే పోనీ, నేను ప్రాణాలతో వదలను. అతణ్ణి సపరివారంగా వధించకుండా అయోధ్యకు తిరిగిపోను, నా ముగ్గురు తమ్ముల మీద ఒట్టు!'' అన్నాడు.

''ఆ యుద్ధంలో నేను కూడా పాల్గొని శక్తికొద్దీ రాక్షసులను చంపుతాను, మీకు నా



చేతనైన సహాయం చేస్తాను,'' అన్నాడు విభీషణుడు.

రాముడు సంతృప్తుడై లక్ష్మణుడితో సముద్ర జలం తెచ్చి, విభీషణుణ్ణి లంకకు రాజుగా అభిషేకించమన్నాడు. లక్ష్మణుడు వానరుల మధ్య విభీషణుణ్ణి లంకా రాజ్యాభిషిక్తుణ్ణి చేశాడు. వానరులు సింహనాదాలు చేసి రాముడికి జయధ్వానాలు పలికారు.

తరవాత సుగ్రీవహనుమంతులు విభీషణుడితో, ''ఇంత మందిమీ ఈ మహాసముద్రాన్ని దాటి లంక చేరట మెలాగో మాకు తెలియ లేదు. ఆ ఉపాయం నువ్వే చెప్పాలి,'' అన్నారు.

''రాముడు సముద్రుడి శరణు పొందాలి. సముద్రుడు రాముడి పూర్వీకుడైన సగరుడికి ఎంతగానో ఋణపడి ఉన్నాడు; అందుచేత రామకార్యం తప్పక తీరుస్తాడు,'' అన్నాడు విభీషణుడు.

సుగ్రీవుడు రామలక్ష్మణులున్న చోటికి వెళ్ళి, విభీషణుడన్న మాట చెప్పి, సముద్రుణ్ణి ఆరాధించాలని రాముడితో అన్నాడు. రాముడందుకు ఒప్పుకుని, సముద్రతీరాన దర్భలు పరిచి, వాటిపైన పడుకున్నాడు.

ఈలోపుగా శార్దూలుడనే రాక్షసుడు, రావణుడి వేగులవాడు, వానరసేన ఉన్న చోటికి వచ్చి, అక్కడి పరిస్థితులన్నీ చూసి, రావణుడి వద్దకు తిరిగివెళ్ళి, ''వానర భల్లూకసేన అపరసముద్రంలాగా లంక పైకి వస్తున్నది. ఉత్తమాయుధాలు ధరించి సీత కోసం వస్తున్న రామలక్ష్మణులు సేనతో సహా సముద్రతీరాన విడిసి ఉన్నారు. నేనీ విషయాలు స్థూలంగా చూసి వచ్చాను. వివరంగా చూసి రావటానికి మరెవరినైనా పంపటం మంచిది,'' అన్నాడు.

అప్పుడు రావణుడు శుకుడనే రాక్షసుడితో, ''నువ్వు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, మంచిగా ఈ మాటలు చెప్పు,'' అని, ఏమి చెప్పాలో చెప్పి పంపాడు.

శుకుడు పక్షి రూపం ధరించి సముద్రం దాటి, వానర సేన దగ్గిరకు ఎగురుతూ వెళ్ళి, సుగ్రీవుడు మొదలైన వారి మీదుగా గాలిలోనే ఉండి ఇలా చెప్పాడు:

''వానర రాజైన సుగ్రీవుడా! రావణుడిలా అన్నాడు: ఉన్నత వంశంలో పుట్టిన వాడవు. మహాబలుడవు. జన్మతః నాకు బంధువులాటి వాడివి. అకారణంగా నాతో విరోధమెందుకు? ఇందువల్ల నీకు ఒరిగేదీ, తరిగేదీ లేదు. వాలి నా స్నేహితుడు. నువ్వు నా తమ్ముడిలాటి వాడివి.



నేను రాముడి భార్యను తెస్తే నీకేమిటి? బుద్ధిమంతుడవు, బాగా ఆలోచించుకుని కిష్కింధకు తిరిగి వెళ్ళు. లంకను దేవతలే ప్రవేశించలేరు గదా, నరుల మాటా, వానరుల మాటా చెప్పేదేమిటి?''

ఈ మాటలు వింటూనే వానరులు ఆకాశాని కెగిరి శుకుణ్ణి పట్టుకుని నేల మీదికి పడదోశారు. శుకుడు ఎలుగెత్తి, ''ఓ రామా, నన్ని వానరులు చంపేస్తున్నారు. దూతను చంపరాదు. నా ప్రభువు అనమన్న మాటలే అన్నాను గాని, నేను సొంతాన ఏమీ అనలేదు,'' అని అరిచాడు. రాముడు జాలిపడి, ''వాణ్ణి చంపకండి,'' అన్నాడు వానరులతో.

శుకుడు దెబ్బతిన్న రెక్కలతో ఆకాశం లోకి లేచి, ''సుగ్రీవుడా, రావణుడి[illegible] టావు?'' అని అ[illegible]

''రావణుడితో ఇలా అన్నానని చెప్పు: రాక్షసరాజా, నువ్వు నాకు స్నేహితుడవు కావు, మేలుచేసిన వాడవు కావు, నా మిత్రుడైన రాముడికి శత్రువువు, నా శత్రువైన వాలికి మిత్రుడవు. అందుచేత తప్పక చంపదగిన వాడవు. నేను నిన్ను సకుటుంబంగా చంపి లంకను భస్మీపటలం చేస్తాను. నిన్ను రాముడి బారి నుంచి దేవతలు కూడా రక్షించలేరు. ముసలి జటాయువును చంపినట్టు కాదు; రామలక్ష్మణులు లేనప్పుడు దొంగతనంగా సీతను ఎత్తుకు వచ్చినట్టూ కాదు; రాముడి ప్రతాపం నీకు తెలియదు,'' అని సుగ్రీవుడు శుకుడితో అన్నాడు.

అంతలో అంగదుడు సుగ్రీవుడితో, ''వీడు దూతలాగా లేడు, వేగుల వాడని తోస్తున్నది. మనతో మాట్లాడుతూనే శిబిరమంతా చూశాడు, వీణ్ణిపట్టుకోండి. పోనివ్వకండి,'' అన్నాడు.

సుగ్రీవుడి ఆజ్ఞానుసారం వానరులు శుకుణ్ణి మళ్ళీ పట్టుకున్నారు. శుకుడు ఆక్రోశిస్తూ, ''ఓ రామా, దు[illegible] ఈ వానరులు రెక్కలు విరుస్తున్నారు, [illegible] పీకేస్తున్నారు,'' అని పెద్దగా మొరపెట్టుకున్నాడు.

రాముడు కోతులతో చెప్పి శుకుణ్ణి కాపాడాడు. తరవాత అతను సముద్రుడికి నమస్కరించి చెయ్యి తల కింద పెట్టుకుని, సముద్రుడికి ఎదురుగా పడుకున్నాడు.

రాముడలా మూడు రాత్రులు గడిపాడు. అంతకాలమూ సముద్రుణ్ణి ధ్యానించాడు. కాని సముద్రుడు సాక్షాత్కరించ లేదు. అతనికి కోపం వచ్చింది. లోకంలో మంచి వాళ్ళు

అసమర్థులుగా గణించబడతారు. సము ద్రుడు తనను అలాగే భావించి ఉంటాడు. అందుచేత రాముడు సముద్రుడికి తన ప్రతాపం చూప నిశ్చయించి లక్ష్మణుడితో, ''లక్ష్మణా, నా ధనుర్బాణాలిలా ఇయ్యి. సముద్రాన్ని ఎండించి, వానరులు కాలి నడ కన లంకకు చేరేలాగు చేస్తాను. సముద్రం లోని జలమంతా భూమి పైకి పారేటట్టు చేస్తాను,'' అన్నాడు.

అతను బాణాలు ఎక్కుపెట్టి వదిలాడు. అవి ధగధగా వెలిగిపోతూ వెళ్ళి సముద్రం ప్రవేశించి, సముద్రాన్ని అల్లకల్లోలం చేశాయి. సముద్రంలో బ్రహ్మాండమైన తరంగాలు పుట్టాయి. నీటి అడుగున ఉండే శంఖాలూ, ముత్యపు చిప్పలూ, భయంకరమైన సముద్ర ప్రాణులూ పైకి తేలాయి.

లక్ష్మణుడు రాముడి చెయ్యి పట్టుకుని, ''ఇంక చాలు! ఊరుకో!'' అన్నాడు. రాముడు వినిపించుకోలేదు.

''సముద్రుడా! నిన్ను పాతాళం దాకా ఇగిర్చేస్తాను! నీలో ఉన్న ప్రాణులన్నిటినీ దహించేసి, నిన్ను ఇసుకపర్రగా చేసి వదిలే స్తాను! నా బలపరాక్రమాలు నీకు తెలియవు! నేను నిన్నేం చెయ్యగలనో తెలుసుకో లేకుండా ఉన్నావు!'' అన్నాడు రాముడు, తనకు ప్రత్యక్షం కాని సముద్రుడితో.

అతనొక భయంకరమైన బాణాన్ని తీసి బ్రహ్మాస్త్రం పఠించి, చెవి దాకా లాగాడు. అతను దాన్ని వదిలిపెట్టక మునుపే భూమ్యా కాశాలు బద్దలయినంత పని అయింది;



కొండలు అదిరాయి; లోకాలన్నిటినీ చీకటి ఆవరించింది; నదులూ, సరస్సులూ కలకపా రాయి. సూర్యచంద్రుల, నక్షత్రాల గతులు తప్పాయి. చీకటి కమ్మింది. పిడుగులు పడ్డాయి. ఆకాశాన ప్రచండమారుతాలు వీచాయి. వాటి వేగానికి మహావృక్షాలు విరు చుకు పడిపోయాయి. ఈ ఉత్పాతాల మధ్య సముద్రపు నీరు ఒక ఆమడ వెనక్కు పోయింది. సముద్రుడు వెనక్కు తగ్గటం చూసి రాముడు బాణం వదలలేదు.

అంతలోనే సముద్ర మధ్యంలోని బ్రహ్మాండ మైన అలల మధ్య నుంచి సముద్రుడు, సమస్త నదులు వెంట రాగా, వెలువడి వచ్చాడు. ఆయన దేహం వైడూర్య వర్ణంగా ఉన్నది; ఎర్రని మాలలూ, బట్టలూ ధరిం చాడు, రంగురంగుల పుష్పమాలికలు తలలో

ధరించాడు; అనేకమైన బంగారు నగలు ధరించాడు; అతని మెడలోని ముత్యాల హారాల మధ్య కౌస్తుభమణి యొక్క తోబుట్టువు ప్రకాశిస్తున్నది.

సముద్రుడు రాముణ్ణి సమీపించి, ముందుగా తానే రాముడి పేరు చెప్పి నమస్కరించి, ''రామా, లోతు అన్నది నాకు స్వభావ సిద్ధమైనది. ఆ గుణాన్ని నేను విసర్జించలేను. కాకపోతే, వానరులు వారధి కట్టేటప్పుడు వారికి సముద్ర ప్రాణుల భయం లేకుండా చెయ్యగలను, వారికి సహాయపడగలను,'' అన్నాడు.

''అలా అయితే, ఎక్కు పెట్టిన ఈ అమోఘాస్త్రాన్ని ఏమి చెయ్యను?'' అని రాముడు అగాడు.

''ఇలా ఉత్తరంగా ద్రుమకుల్యమనే చోట భయంకరులైన దొంగలు కొందరుండి, నా జలాన్ని తాగి, సమస్త పాపకార్యాలూ చేస్తున్నారు. ఎంతో కాలంగా వారి స్పర్శసహించ లేకుండా ఉన్నాను. నీ బాణాన్ని వారిపై ప్రయోగించు,'' అని సముద్రుడు, రాముణ్ణి కోరాడు.

ఆ ప్రకారమే రాముడు తన బాణాన్ని ద్రుమకుల్యం పైన ప్రయోగించాడు. అది పిడుగులాగా వెలుగుతూ వెళ్ళి పడినచోటుకు మరుకాంతార మని పేరు వచ్చింది. బాణం పెద్ద మోతతో భూమిని చీల్చుకుని వెళ్ళిన చోట పాతాళం నుంచి జల పుట్టుకొచ్చింది. వ్రణకూపమని పేరు పొందిన ఆ జల ఎన్నడూ ఆగక ప్రవహిస్తూనే ఉంటుంది.

ద్రుమకుల్యంలోని దొంగలందరూ నశించారు.

అప్పుడు సముద్రుడు రాముడితో, ''నీ సేనలో గల నళుడనే వానరోత్తముడు విశ్వకర్మ కొడుకు. శిల్ప విద్యలలో తండ్రికి తీసిపోడు. ఇతని చేత సేతువు నిర్మింపజెయ్యి. అది మునగకుండా నేను చూస్తాను,'' అన్నాడు.

ఈ మాట చెప్పి సముద్రుడు అంతర్ధానం కాగానే నళుడు, ''సముద్రుడన్న మాట నిజమే. నేను సేతువు నిర్మించగలను. నా శక్తి మరొకరు చెబితే బాగుంటుందని నాకై నేనే చెప్పదలచలేదు. కావలిస్తే వానరులందరూ కలిసి ఇప్పుడే సేతు నిర్మాణం ప్రారంభించవచ్చు,'' అన్నాడు రాముడితో.





# పట్టపుటేనుగు

కొన్నివేల ఏళ్ళక్రితం సిరిపురరాజ్యాన్ని అశోక వర్మ పాలించాడు. ఆయన ఆస్థానంలో ఏటా యుద్ధ విద్యలలో పోటీలు జరిగేవి. వాటిలో హెచ్చు శక్తిసామర్థ్యాలు ప్రదర్శించిన వారిని రాజు తన కొలువులో ఉంచుకునేవాడు. అలా రాజుగారి కొలువులో ప్రవేశించి, రాజుగారి ఆదరానికి పాత్రుడైన వాడు రవివర్మ అనే యువకుడు.

అశోకవర్మకు సంతానం లేదు. ఆయన ఆకస్మికంగా మరణించటం వల్ల తన తరవాత ఎవరు రాజు కావలిసినదీ ఆయన చెప్పలేదు. ఆయన కొలువులో రాజు కాదగిన వాళ్ళు చాలామంది ఉన్నారు. కాని మంత్రి సుమంతుడు ఏ ఒక్కరిని గాని రాజుగా చేయటానికి భయపడ్డాడు. ఎవరు రాజైనా మిగిలినవాళ్ళు శత్రువులవుతారు.

అందుచేత మంత్రి ఈ విషయమై రాజ గురువును సంప్రతించాడు. రాజగురువు మంత్రితో, ''ఇది మీరు తేల్చవలసిన సమస్య కాదు. పట్టపుటేనుగు ఎవరి మెడలో దండవేస్తే వారిని రాజును చెయ్యటం మనకు అనాదిగా ఉంటున్న ఆచారం. ఆ పాత పద్ధతిని ఇప్పుడు అమలు చేద్దాం,'' అన్నాడు.

పట్టపుటేనుగు కాబోయే రాజును ఎన్నిక చేసిందంటే ఎవరూ అభ్యంతరం చెప్పటానికి ఉండదు. అందుచేత మంత్రి రాజగురువునే ఒక మంచి ముహూర్తం చూడమన్నాడు. రాజ గురువు రెండు వారాల అనంతరం మంచి ముహూర్తం ఉన్నదని చెప్పాడు. ఫలాని రోజున పట్టపుటేనుగు ఎవరి మెడలో పూలమాల వేస్తే వారు సిరిపురానికి రాజుగా అభిషేకించబడ తారని మంత్రి దండోరా వేయించాడు.

**25**-ఏళ్ళనాటి చందమామ కథ




ఈ చాటింపు ఒక మనిషికి తీవ్రమైన ఆశాభంగం కలిగించింది. మరొక మనిషిలో లేనిపోని దురాశ కలిగించింది.

ఆశాభంగం పొందినవాడు రవివర్మ. అతను చనిపోయిన రాజుకు ఎంత సన్నిహితుడో కొలువులో ఉన్న ఇతరులకు తెలియదు. అశోకవర్మ తన రహస్యాలోచనలన్నీ రవివర్మ తోనే చేసేవాడు. తన కన్న ముందు నుంచీ కొలువులో ఉన్న పెద్దలు అసూయ పడిపోతారని రవివర్మ రాజుగారి వద్ద ఒక చిన్న ఉద్యోగి అన్నట్టే ప్రవర్తించేవాడు. అశోకవర్మకు తాను చనిపోతానన్న అనుమానం ఏమాత్రం కలిగినా ఆయన అనంతరం తననే రాజు చెయ్యమని మంత్రితో చెప్పి ఉండేవాడే. ఆ విషయంలో రవివర్మకు ఎలాటి సందేహమూ లేదు. కాని పట్టపుటేనుగుకు ఇదంతా ఏం తెలుస్తుంది? అది ఎవరి మెడలోనో దండ వేసేస్తుంది. వాడే రాజైపోతాడు. ఈ విషయం తలుచుకుని రవివర్మ చెప్పలేనంతగా కుంగిపోయాడు.

లేని పోని దురాశకు గురి అయినవాడు పట్టపుటేనుగును సాకే మావటివాడు. ఎలాగైనా ఆ ఏనుగుకు తనమెడలో దండవెయ్యటం అలవాటు చేస్తే అది రాజును ఎన్నుకునే రోజున తన మెడలోనే దండ వేస్తుందనీ, తాను రాజు కావచ్చుననీ వాడికి ఆలోచన కలిగింది. రెండు వారాల వ్యవధి ఉన్నది గనక, ఈలోపుగా ఏనుగుకు తనమెడలో దండవెయ్యటం అలవాటు చేయవచ్చునని వాడు ఆశగా అనుకున్నాడు.

పట్టపుటేనుగు ఉండే శాలను ఆనుకుని ఒక భవనం ఉన్నది. దాని ప్రహరీగోడను అనుకుని ఒక పూలతోట ఉన్నది. మావటివాడు ఆ గోడ దూకి, పూలు కోసుకువచ్చి, మాల కట్టి, దాన్ని ఏనుగు తొండానికి అందించి, దానిచేత మళ్ళీమళ్ళీ తన మెడలో వేయించుకోసాగాడు.

ఇంతకూ ఏనుగు శాల పక్కన ఉన్న భవనం రవివర్మది. అతను తన పూజకూ, అలంకరణకూ తన తోటలో పూలే ఉపయోగించేవాడు. తోటలో పూలు తరిగిపోతూ ఉండటం గమనించి, దొంగ ఎవరో కనిపెట్టాలని ఒక రాత్రి అతడు తోటలోనే దాక్కున్నాడు.

మావటివాడు రాత్రివేళ గోడ దూకి వచ్చి పూలు కోసుకుని, గోడ దూకివెళ్ళిపోయాడు. రవివర్మ గోడ వద్దకు వచ్చి, మావటివాడు ఏనుగుశాలలోకి వెళ్ళటమూ, లోపల పూలతో మాల కట్టుతూ ఉండటమూ చూశాడు. వాడు ఆ మాలతో ఏం చేస్తాడో చూడటానికి అతను ప్రహరీగోడ ఎక్కి చప్పుడు చేయకుండా నిలబడ్డాడు.

మాల కట్టటం పూర్తి కాగానే మావటివాడు ఏనుగు తొండానికి మాల అందించి, దాన్ని ఏనుగు తన మెడలో వేసేటట్టు చేస్తున్నాడు. మావటివాడి వీపు గోడ కేసి ఉండటంచేత వాడు రవివర్మను చూడలేదు, కాని ఏనుగు చూసి, ఘీంకరించి మాలతో తొండాన్ని పైకెత్తి వెనక్కు తిరిగి చూసేలోపల రవివర్మ గోడ మీది నుంచి దిగిపోయాడు. తన రహస్యం ఎవరో చూశారని మావటివాడికి తెలిసి భయపడ్డాడు. చుట్టు పక్కల కలయ చూశాడు. కాని ఆ చూసిన మనిషి ఎవరో వాడికి తెలియ



లేదు. తరవాత వాడు ఏనుగును తరిఫీదు చెయ్యలేక పోయాడు.

ఇంతలోనే రాజును పట్టపుటేనుగు ఎన్నుకునే రోజు వచ్చింది. ఏనుగు తొండానికి పుష్ప మాలను అందించి మావటివాడు రాజ ప్రాంగణంలోకి వచ్చాడు. ఏదో వంకన మావటివాడు రెండు మూడుసార్లు ఏనుగు ముందుకు వచ్చాడు గాని, అది వాడి మెడలో మాల వెయ్యలేదు. అది ఎవరి కోసమో చూస్తున్నట్టు కనిపించింది. రవివర్మ దాని కంటపడగానే అది గట్టిగా ఘీంకరించి, గబగబా వెళ్ళి అతని మెడలో మాల వేసింది.

రవివర్మను అప్పటికప్పుడే రాజుగా అభిషేకించారు.

తరవాత ఒకనాడు మావటివాడు ఏకాంతంలో రవివర్మను సమీపించి, ''మహారాజా, నన్ను తమరు క్షమిస్తే ఒక్క సందేహం మనవి చేసుకుంటాను,'' అన్నాడు.

''నిర్భయంగా అడుగు,'' అన్నాడు రవివర్మ చిన్నగా నవ్వుతూ.

''నేను రాజు కావాలన్న దుర్బుద్ధితో పట్టపుటేనుగుకు నా మెడలో మాల వెయ్యటం అలవాటు చేశాను. కాని తీరా సమయం వచ్చేసరికి అది మాల నాకు వెయ్యక మీ కెందుకు వేసింది?'' అని మావటివాడు అడిగాడు.

రవివర్మ నవ్వి, ''నువ్వు దానికి ఎన్ని విద్యలో నేర్పావు. కాని అవి నీకోసం కాదు. నువ్వు మాల వేసుకుని కనిపించినప్పుడల్లా నువ్వు మరెవరోలాగా కనిపిస్తావు. అది నీ నుంచి మాల వెయ్యటం నేర్చుకున్నదేగాని, నీ మెడలోనే మాల వెయ్యాలన్న ఆలోచన దాని మెదడులోకి రాలేదు. ఒక రాత్రి అది నీ మెడలో మాల వేయబోతూ నన్ను చూసింది. అప్పుడు నా మెడలో మాల ఉన్నది గనక, నాకు మాల సహజమనుకుని దాని తొండానికి ఉన్న మాలను నా కేసి చాచింది. ఆ రాత్రే నీ దుర్బుద్ధి నేను గ్రహించాను. అప్పటి నుంచే నా మెడలో మాల వెయ్యాలన్న ఆలోచన దాని మనసులో ఉండి ఉంటుంది. రాజు ఎన్నిక నాడు ఆ పని చేసింది,'' అన్నాడు.






శాంతిపురి రాజు ఆర్య, రాణికి తరచూ భయంకరమైన కలలు రావడం గురించి కలత చెందాడు. తూరుపు ప్రాంతంలో పిల్లలు కనిపించకుండా పోతున్నారని తెలిసి ఆయన మరింత విచారపడ సాగాడు. ఒక సాధువు వచ్చి ఈ రెండు సంభవాలకు మధ్య ఉన్న సంబంధం గురించి చెప్పడంతో ఆసక్తిగా వినసాగాడు.

శాంతిపురి కొండలు సైతం ఎర్పడని అతి ప్రాచీన కాలంలో ఈ ప్రాంతంలో బలవంతులైన రెండు తెగల ప్రజలు నివసించేవారు...

మరేకులూ, భర్దులూ ఒకే నేలతల్లి బిడ్డలే అయినప్పటికీ నిప్పూ, నీరులా పోట్లాడుకునే వారు. మరేకులు కొలిచేదాన్ని భర్దులు నిందించేవారు. అవునంటే కాదంటూ ప్రతి విషయంలోనూ భేదించడం వల్ల ఉభయుల మధ్య తరచూ గొడవలు జరిగేవి.

భర్దులకు లేని ఒక ప్రత్యేక శక్తి మరేకులకు ఉండేది. అదే మారిఘూ.

మారిఘూ ఒక మంత్రగత్తె. భవిష్యత్తును చెప్పగల శక్తితో పాటు ఆమె దగ్గర సువర్ణ ద్వీప మాణిక్యం ఉండేది.




సువర్ణ ద్వీపమా? అది కల్పిత ద్వీపం కదా?
వాస్తవాల నుంచే కల్పితాలు పుట్టుకు వస్తాయి మహారాజా!


సువర్ణ ద్వీపం ఈ ప్రాంతంలో వెలసిన ప్రపంచంలో కెల్లా అత్యంత సంపన్న మైన దేశం. ఇక్కడి భూమినుంచి అమూల్య మైన మణులు, మాణిక్యాలు పుట్టుకు వచ్చాయి.


స్వర్గలోకంలో విసుగు కలిగితే దేవతలు ఈ ద్వీపంలోకే దిగివచ్చే వారట!
మరి మాణిక్యం మాటేమిటి?


మాణిక్యాన్ని మారిఘా తన ప్రాణసమానంగా కాపాడేది. అయితే, ఒకనాటి రాత్రి అది కనిపించకుండా పోయింది.


మారిఘా అమితాగ్రహం చెందింది. ఇది మరేకుల పనే అనీ, అందుకు వాళ్ళు తగిన మూల్యం చెల్లించక తప్పదనీ అనుకున్నది. మాణిక్యాన్ని వెదకడానికి తన తెగవారిని దశదిశలకూ పంపింది. కాని మాణిక్యం లభించలేదు.

భర్గులు వెంటనే కార్య రంగంలోకి దిగారు. వాళ్ళనాయకుడు జోయా పథక రచనకు పూనుకున్నాడు.

నాయకా! మరేకుల మీద మనం పగ సాధించడానికి ఇదే తగిన సమయం.

దాన్ని దొంగిలించడానికి సాహసించిన దొంగ ఎవడై ఉంటాడు?

మాణిక్యాన్ని దుష్టశక్తి ఆవహించిందట. దాన్ని దొంగతనంగా పట్టుకు పోయిన వారిని నాశనం చేస్తుంది!

అది కేవలం వదంతిగానే భావిస్తున్నాను. అలాంటి మాణిక్యం ఎల్లప్పుడూ మంచినే చేస్తుంది!

అది మాణిక్యం కానేకాదు. అది ప్రతి మరేకుడిలాగే పుట్టుక తోనే శాపగ్రస్తం.

మారిషా శాపం గురించి తెలిసివుండి కూడా నువ్విలా చెబుతున్నావా?

మరేకుల మీద దాడి చేసి వాళ్ళను బానిసలుగా చేసుకోవాలని జోయా నిర్ణయించాడు. అయితే, సువర్ణ దీప మాణిక్యాన్ని సొంతం చేసుకోవాలన్న అతడి మనసులోని అతి పెద్ద కోరిక సజీవంగా మిగిలి పోయింది!


మారిషూ శాపగ్రస్తురాలా?


ప్రతి పౌర్ణమి నాటి రాత్రి మారిషూ ఆడతోడేలుగా మారిపోతుంది. ఆమె శరీరం బాధతో విలవిలలాడి పోతుంది. కాళ్ళ కింద నేల కంపిస్తుంది. దీనంగా రోదిస్తుంది.




మాణిక్యాన్ని భర్తులే దొంగిలించి ఉంటారని మారిషూ అనుమానించింది.


మరేకులు, భర్తులు మూడేళ్ళపాటు ఆగకుండా యుద్ధం చేశారు. ఇరుపక్షాలలోనూ గొప్ప ప్రాణ నష్టం జరిగింది.


మారిషూ చింతాక్రాంత అయింది. మాణిక్యం పోగొట్టుకున్నందుకు తన్ను తాను నిందించుకున్నది.


తన తెగ వాళ్ళ బాధలు చూస్తూ ఉండలేక ఆ ప్రాంతాన్ని శాశ్వతంగా వదిలి వెళ్ళాలని నిర్ణయించింది.
ఆమె ఎక్కడికి వెళ్ళింది?
-(ఇంకావుంది)

# చందమామ
# లోకజ్ఞానం క్విజ్ - 2
## (పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు
రాసిన ఒకరికి బహుమతి
రూ. 250లు.*

## భూగోళం గురించి తెలుసుకుందాం

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 2 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. మే నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. ఇండియన్ స్టాండర్డ్ టైమ్‌కూ, గ్రీన్‌విచ్ మీన్ టైమ్‌కూ మధ్య ఎన్ని గంటల తేడా ఉంటుంది?
2. అత్యంత ఎత్తయిన ప్రదేశంలోనూ, మరీ లోతైన ప్రదేశంలోనూ, ఉన్న తటాకాలు ఏవి?
3. ప్రపంచంలోకెల్లా అత్యంత పెద్దదైన డెల్టా ఏది? అది ఏ నది (నదుల) మధ్య ఏర్పడి ఉన్నది?
4. మన దేశంలో సుదీర్ఘమైన కాలం గల రోజు ఏది?
5. ఆఫ్రికాలోని అతిపెద్ద నగరం ఏది?
6. వెనిస్‌ను కాలువల నగరంగా పేర్కొంటారు. మరి ఆ నగరం గుండా ప్రవహించే మొత్తం కాలువలు ఎన్ని?
7. రాగి గనులు మన దేశంలో ఎక్కడ ఉన్నాయి? ఏ రాష్ట్రంలో?
8. మూడు వైపులా విదేశం సరిహద్దులుగాగల రాష్ట్రం ఏది? ఆ దేశం ఏది?

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు



## చంద్రుడి ఉపరితలంలో అర్ధరాత్రి సూర్యుడు!

స్కాండినేవియా కొన్ని ప్రాంతాలలో వేసవిలో ఇరవై నాలుగు గంటలూ సూర్యుడి వెలుతురు ఉంటుంది. చంద్రుడి ఉపరితలంలో కూడా ఎప్పుడూ ఎండకాసే ప్రాంతాలు కొన్ని ఉన్నాయని ఖగోళశాస్త్ర వేత్తలు ఇటీవల కనుగొన్నారు.

అమెరికా జాన్స్ హాప్‌కిన్స్ యూనివర్సిటీకి చెందిన డా. బెన్ బుస్సీ అభిప్రాయం ప్రకారం చంద్రుడి మీద ఇరవైనాలుగ్గంటలూ ఎండ కాసే కొన్ని ప్రదేశాలు ఉన్నాయి. చంద్రుడి ఉత్తర ధ్రువంలోని రిమ్ ఆఫ్ పీరీ అనే 73 అడుగుల వెడల్పాటి క్రేటర్‌ను బెన్ బుస్సీ తన టీమ్‌తో కలిసి అధ్యయనం చేశాడు. అందులో కొన్ని పర్వతశిఖరాలు వేసవి సమయంలో నిరంతరాయంగా ప్రకాశంతో కనిపించడం తెలియవచ్చింది. శీతాకాలంలో మార్పు ఉండవచ్చు అంటున్నారు. ఈ అధ్యయనాలు అంతకు ముందు జరిగిన క్లెమెంటీన్, లూనార్ ప్రాస్పెక్టర్ మిషన్స్ చేసిన పరిశోధనా లఫలితాలనూ, కరీబియన్ ప్యూర్‌టో రికో అరిసిబో రేడియో టెలిస్కోప్ తీసిన రాడార్ కొలతలతో కనుగొన్న విషయాలనూ ధ్రువీకరిస్తున్నాయి.

## మన పరిసరాలు



## బాగా నిద్రించండి-మంచి మార్కులు తెచ్చుకోండి!

మంచి నిద్ర జ్ఞాపక శక్తికి దోహదం చేస్తుందని కొత్త పరిశోధనల అధ్యయనాలు సూచిస్తున్నాయి. ఒక అధ్యయనంలో 84 మంది కళాశాల విద్యార్థులకు యంత్రం రూపొందించిన ఒకే విధంగా ధ్వనించే విభిన్న పదాలను వినిపించారు. మరునాడు వాటిని పునశ్చరణ చేసుకుని చెప్పమన్నారు. అలా చెప్పడం విద్యార్థులకు కష్టమనిపించింది. ఆ తరవాత మరో వందమంది పెద్దలను తీసుకుని కంప్యూటర్ కీబోర్డ్ మీద నిర్దిష్ట వరుసక్రమంలో ఉన్న ఐదు నంబర్ల కీలను టైప్ చెయ్యమని చెప్పారు. సక్రమంగా, వేగంగా టైప్ చేయడానికి మళ్ళీ మళ్ళీ చేయవలసివచ్చింది. రాత్రి బాగా నిద్రపోయి మరునాడు వచ్చి అలాంటి పనే చేయమన్నప్పుడు వాళ్ళ పనితీరు ఎంతో మెరుగ్గా కనిపించింది. విషయాలను గుర్తుపెట్టుకోవడానికి మంచినిద్ర ఎంతగానో దోహదం చేస్తుందని ఈ అధ్యయనాల వల్ల తెలియవచ్చింది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


SOURA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మే 2009 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్, 2/513,
సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041

## అభినందనలు

జనవరి నెల పోటీ ఫలితాలు
సి. లక్ష్మీ మనోజ్ఞ
3వ క్రాస్ రోడ్, రామ్‌జీ నగర్,
నెల్లూరు - 524 002
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: ఎంతని వేచి చూడాలి!
రెండవ ఫోటో :ఎప్పటికి పైకి చేరాలి!!

## సమాధానాలు :

1. కిరణ్‌బేడీ 2. డా. పి. కె. సేథీ 3. ఆర్యభట 4. డా. ఎస్. రాధాకృష్ణన్
5. మధ్వాచార్య 6. కిషన్‌కాంత్.

**Printed and Published by L. Subramanyan at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,** JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : L. Subramanyan**

CHANDAMAMA (Telugu) March 2009 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08




# బుబ్బా సాహసాలు




ఒకనాటి మధ్యాహ్నం కొందరు పిల్లలు డ్రిల్ ఎక్సర్‌సైజ్ చేస్తున్నారు.




కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాం, సార్?




అంతలో బుబ్బా ఎక్కడినుంచో వచ్చాడు.




వాళ్ళ చేతుల్లోకి బుబ్బా బబుల్‌గమ్ విసిరాడు.




ఇన్‌స్ట్రక్టర్ నోట్లోకి కూడా బుబ్బా ఒక బబుల్ గమ్ వేశాడు.




ఆహో! ఏమి దృశ్యం!




త్వరలో ప్లే గ్రౌండ్‌లో వెల్లువెత్తింది. మధుర జలాలలో పిల్లలు తేలియాడ సాగారు.



పిల్లలూ! ఇక డ్రిల్ వద్దు. హాయిగా ఎంజాయ్ చెయ్యండి!



బుబ్బాలూ బబుల్‌గమ్ మ్యాజిక్! జ్యూసీ మస్తీ!

